2

# మార్క్సిజం మూలసూత్రాలు

## చారిత్రక భౌతికవాదం

కంభంపాటి సత్యనారాయణ
(సీనియర్)



# మార్క్సిజం మూలసూత్రాలు ②

## చారిత్రక భౌతికవాదం

కంభంపాటి సత్యనారాయణ
(సీనియర్)




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

Marxism Muulasutralu - 2 (Charithraka Bhotikavaadham)
By Kambhampati Satyanarayana (Senior)

రాజకీయ / సామాజిక / ఆర్థికశాస్త్ర గ్రంథాలు

ప్రచురణ నెం. : 27

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : డిశంబర్ 1963
ద్వితీయ ముద్రణ : ఫిబ్రవరి, 2005

**వెల: రూ. 10-00**

ప్రతులు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-1.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్, సుల్తాన్‌బజార్), హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం,
కాకినాడ.



ముద్రణ : **సరస్వతి ఆఫ్‌సెట్ ప్రింటర్స్**, హైద్రాబాద్

# విషయ సూచిక





# చారిత్రక భౌతికవాద సారాంశం

## 1. సమాజాన్ని గురించిన మానవ దృక్పథంలో విప్లవం.

సామాజిక వ్యవస్థలు కాకతాళీయమైనవా, లేక కొన్ని బలీయమైన అదృశ్యశక్తుల వల్ల ఏర్పడుతున్నాయా? కొద్దిమంది అల్పసంఖ్యాక ప్రజలకే గాక, యావన్మంది ప్రజలకు సుఖసంపదలు, స్వేచ్ఛ సాధించేందుకై యీ వ్యవస్థలను మార్చడం సాధ్యమా? సాధ్యమైతే ఎలా సాధ్యం? ప్రజలంతా గాఢంగా వాంఛించే ఈ లక్ష్యాలను సాధించడానికి మానవులందరినీ నడిపే వారెవరు? అసలు మానవజాతి ఎటువైపు నడుస్తోంది? అభ్యుదయాన్ని కొనితెచ్చే స్వర్ణయుగం వైపా? లేక నిస్తబ్ధత పతనం వైపా? ఈ ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకునేందుకు మానవులు పూర్వంనుంచీ ప్రయత్నిస్తూనే వున్నారు.

అన్ని యుగాలలోను, అన్ని జాతులలోను మేధావులు ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పడానికి ప్రయత్నించారు. కాని వారి సిద్ధాంతాలూ, దృక్పథాలూ అనేక శతాబ్దాల్లో కూల్చివేయబడ్డాయి. ఇతర పండితులు వాటిని ఖండించడం వల్లను పరిస్థితుల కవి భిన్నంగా వుండడంచేతను, చారిత్రక పురోగతికి అవి సరిపడకపోవడం వల్లను వారి సిద్ధాంతాలూ, దృక్పథాలూ నశించిపోయాయి. సమాజ విజ్ఞానరంగంలో జ్ఞానసంపాదన మార్గం చాల దీర్ఘంగా, కష్టాలతో కొనసాగింది.

అసలు విషయ మేమంటే, సామాజిక జీవితం ప్రకృతి పరిణామాలకంటె చాలా క్లిష్టమైనది. ప్రకృతి పరిణామాలు మన ప్రత్యక్ష పర్యాలోకనంకింద, చాలవరకు క్రమబద్ధతతో పునరావృత్తం అవుతూంటాయి. అందుచేత, వాటి ఆంతర్యాన్ని కొంత సులభంగా తెలుసుకోవచ్చు. కాని సామాజిక జీవితంలో పరిణామాలు అంత క్రమబద్ధతతో ఆ విధంగా పునరావృత్తంకావు. అందుచేత

సామాజికాభివృద్ధిలో ఒక ఖచ్చితమైన నియమాన్ని అర్థం చేసుకోవడంగాని, కనిపెట్టడంగాని చాలా కష్టం.

మరొక ప్రధానమైన భేదం వుంది. ప్రకృతిలో మనం వ్యక్తులకు సంబంధించని సహజ శక్తుల్ని గురించి పరిశీలనలు జరుపుతాం. కాని సామాజికచరిత్రలో ఆలోచనాశక్తి కలిగిన, సంకల్పబలం కలిగిన ఎల్లప్పుడూ ఏదో ఒక లక్ష్యంకోసం పనిచేస్తున్న మానవుల కార్యాలను గురించి పరిశీలనలు జరుపుతాం. తొలిచూపులకు, ఈ రంగంలో ప్రధానకర్తవ్యం ప్రజల కార్యాలను ప్రేరేపించే వుద్దేశ్యాలేమిటో తెలుసుకోవడం, ఒకానొక వ్యక్తి ఏ లక్ష్యాన్ని తన ముందుంచుకున్నాడో అర్థం చేసుకోవడం మాత్రమేనని అనుకుంటాం. అది తెలుసుకుంటే, వారు లేక అతడు ఎందువల్ల అలా చేశారో, మరొకలాగ ఎందుకు చేయలేదో తెలిసిపోతుందని భావిస్తాం. సామాజిక జీవితాన్ని గురించిన ఇట్టి మనశ్శాస్త్ర వివరణ మార్క్సుకి ముందు సమాజవిజ్ఞానశాస్త్రంలో ప్రబలంగా ఉండేది; ఇప్పటికీ బూర్జువా సమాజ విజ్ఞాన సూత్రాల్లో ఇది కనిపిస్తుంది. ఇది సరియైన సమగ్రమైన దృక్పథం కాదు.

ప్రతివ్యక్తి ఏ పనైనా కొన్ని ఉద్దేశాలతో చేస్తాడనేమాట నిజమే. ప్రతివ్యక్తికీ కొన్ని లక్ష్యాలుంటాయి. కాని మొదట మనల నెదుర్కొనే సమస్య, ఒక వ్యక్తికి ఆ ఉద్దేశాలే ఎందుకుండాలి? ఆ లక్ష్యాలే ఎందుకుండాలి? ఇతర ఉద్దేశాలు, లక్ష్యాలు ఎందుకుండకూడదు? రెండవ విషయ మేమంటే, ప్రపంచ చరిత్రను ఎంత అషామాషీగా పరిశీలించినా, ఒకటి స్పష్టంగా కనిపిస్తుంది: విభిన్న ప్రజల లక్ష్యాలు, ప్రయోజనాలు, తత్పర్యవసానంగా జరిగే కార్యాలు ఎల్లప్పుడూ సంఘర్షిస్తూనే వచ్చాయి; ఈ సంఘర్షణ ఒక చారిత్రక ఘటన. దాని అంతిమ పర్యవసానం తరచు అందులో పాల్గొన్న వ్యక్తుల ఉద్దేశాలకు భిన్నంగా ఉంటూవచ్చింది.

ఉదాహరణకు, 1789-94 మధ్య ఫ్రెంచి విప్లవం జరిగింది. అందులో పాల్గొన్న అనేకమంది తామొక హేతుబద్ధమైన శాశ్వత న్యాయం చేకూర్చే పరిపాలనా విధానాన్ని స్థాపిస్తున్నామని భావించారు; సర్వ సమానత్వంపై, అప్రతిహతమయిన మానవ హక్కులపై ఆధారపడే సమాజాన్ని తాము నిర్మిస్తున్నామనుకొన్నారు. కాని త్వరలోనే బూర్జువావర్గం యొక్క అధిపత్యాన్ని కొనివచ్చేటందుకు వారు మార్గం

సుగమంచేశారని వారికి స్పష్టమైంది. ఫ్యూడల్ భూస్వాములకు అర్ధబానిసలకు (Serfs) మధ్య పాత అసమానత పోయి, దాని స్థానంలో కొత్త అసమానత ప్రత్యక్షమైంది. అదే బూర్జువా వర్గానికీ, కార్మికులకూ మధ్య అసమానత.

అంటే ఒకవైపు ప్రతివ్యక్తీ వేరువేరుగా సొంత ఆలోచనతో చేసే పనులకూ, మరోవైపు మొత్తం మీద సమాజం యాదృచ్ఛికంగా చెందే అభివృద్ధికీ మధ్య వైరుధ్యం వుందన్నమాట. మార్క్సుకి చాల కాలంముందే ఈ వైరుధ్యం కనుగొనబడింది. కాని, తత్వవేత్తలు దానికి సరియైన కారణం చెప్పలేకపోయారు. వాస్తవ చారిత్రక గమనాన్ని పరిశీలించడంలో వారు కొంతమంది చారిత్రక వ్యక్తుల ఉద్దేశాలను, లక్ష్యాలను ఊహించడం మాత్రమే చేశారు. ఆ విధంగా, చారిత్రక గమనాన్ని అనేక యాదృచ్ఛిక ఘటనల సముదాయంగా భావించారు. వారిలో కొందరు, చారిత్రకగతి ఆవశ్యకతచే శాసింపబడుతుందని అభిప్రాయపడినప్పటికీ త్వరలోనే వారు అజ్ఞేయవాదంలో పడిపోయారు. ఒక బాహ్యశక్తియొక్క ప్రమేయం (భగవంతుడు, "అఖండభావం", "పరమాత్మ" వగైరా) ప్రజల కార్యాలను ప్రేరేపిస్తుందని వారు భావించసాగారు.

సామాజికాభివృద్ధి యొక్క అత్యంత క్లిష్టమైన స్వభావంవల్ల పెంపొందిన భావవాద దృక్పథాన్ని దోపిడీవర్గాలు తీవ్రంగా ప్రోత్సహించాయి. వారు ఆర్థిక సామాజిక అసమానతకుగల అసలు కారణాలను మరుగుపరచారు. ఐశ్వర్యమంతా కొద్దిమంది చేతుల్లో పోగుపడి, మిగతావారందరూ దారిద్ర్యంతో అలమటించడానికి గల కారణాలను కప్పిపుచ్చారు. ఇలా కప్పిపుచ్చడం వారి ప్రయోజనాలకు అవసరం. ఈ వర్గాల కృషి ఫలితంగా సమాజాన్ని గురించిన భావవాద ధోరణులు ప్రజలపై ఈనాటికీ ప్రభావం కలిగిస్తున్నాయి. పెట్టుబడిదారీ దేశాల్లో ఇవి విస్తృత వ్యాప్తిలో వున్నాయి.

ప్రజల భావాలను అభిప్రాయాలను లక్ష్యాలను నిర్ణయించేది ఏదో వివరించాలంటే, సామాజిక సమస్యల అధ్యయనం పట్ల ఉన్న దృక్పథంలోనే విప్లవాత్మకమైన మార్పు రావాలి. పెట్టుబడిదారీ విధానం నెలకొన్న తరువాతనే, వర్గ పోరాటం యొక్క ఆర్థిక పునాదులను అది బహిర్గతంచేశాకనే, ప్రపంచ చరిత్రలో కార్మికవర్గం అవతరించిన తర్వాతనే

అట్టి విప్లవాత్మకమైన మార్పు సాధ్యమయింది. సమాజాన్ని గురించి ఖచ్చితమైన శాస్త్రీయ విశదీకరణ అంటే భయపడని, అట్టి విశదీకరణను స్వయంగా కాంక్షించే కార్మికవర్గం అవతరించిన తరువాతనే అట్టి విప్లవాత్మకమైన మార్పు సాధ్యమైంది.

ఇట్టి చారిత్రక పరిస్థితులలోనే మార్క్సు, ఎంగెల్సులు ఈ రంగంలో శాస్త్రీయ విజయాలను సాధించడం సంభవమైంది. వారు గతితార్కిక భౌతికవాదాన్ని సమాజ అధ్యయనానికీ, సమాజచరిత్ర యొక్క అధ్యయనానికీ విస్తృత మొనర్చారు. సామాజికాభివృద్ధికి సంబంధించిన సార్వత్రిక నియమాలెట్టివో వివరిస్తూ మరొక శాస్త్రీయ సిద్ధాంతాన్ని రూపొందించారు. అదే *చారిత్రక భౌతికవాదం (Historical Materialism), లేదా చరిత్రను గురించిన భౌతికవాద దృక్పథం.*

మార్క్సు, ఎంగెల్సులు సామాజిక శాస్త్రంలో సాధించిన విప్లవం ఏదంటే, సమాజంలో అదృశ్య శక్తులేవీ, లోకాతీత శక్తులేవీ పనిచేయడంలేదనీ, ప్రజలే తమ చరిత్రను తాము నిర్మించుకుంటున్నారనీ వారు ఋజువుచేశారు. ఇది సమాజాన్ని గురించిన ఆధ్యాత్మిక దృక్పథాలన్నిటినీ గట్టి దెబ్బకొట్టింది; చరిత్ర సహజ పరిణామక్రమమనీ, బాహ్యప్రమేయం దాని కవసరంలేదనీ అర్థం చేసుకోడానికిది దోహదం చేసింది.

రెండోవైపు ప్రజలు తమ చరిత్రను ఎవరి యిష్టం వచ్చినట్లు వారు నిర్మించుకోలేరనీ, ఎన్నో శతాబ్దాలనుంచి వారసత్వంగా వచ్చే భౌతిక పరిస్థితులమీద ఆధారపడి తమ చరిత్రను తాము నిర్మించుకోగలరనీ మార్క్సిజం నిరూపించింది. ఇది యధేచ్ఛావాదాన్నీ (Voluntarism), స్వీయాత్మకవాదాన్నీ (Subjectivism) గట్టిదెబ్బ కొట్టింది; చరిత్ర స్వతస్సిద్ధ నియమాలచే శాసింపబడు పరిణామక్రమమని అర్థం చేసుకునేందుకు యిది తోడ్పడింది. మార్క్సిస్టు సిద్ధాంతం సమాజ విజ్ఞానశాస్త్రాని కెంత ముఖ్యమో తెలియజేస్తూ లెనిన్ యిలా రాశాడు:

"ఈ భౌతికవాద సిద్ధాంతం మొట్టమొదటిసారిగా శాస్త్రీయమైన సమాజ విజ్ఞానశాస్త్రాన్ని రూపొందించగలిగేటట్లు చేసింది... సామాజిక సంబంధాలను ఉత్పత్తి సంబంధాలుగాను ఉత్పత్తి సంబంధాలను

ఉత్పత్తిశక్తుల అభివృద్ధిస్థాయిగాను చూపడంవల్లనే సామాజిక వ్యవస్థల అభివృద్ధి సహజ చరిత్రయొక్క పరిణామక్రమమనే భావనకు గట్టి పునాది ఏర్పడింది."[1]

మార్క్సు చారిత్రక భౌతికవాదంయొక్క తొలిసూత్రాన్ని ఇలా నిర్వచించాడు:

"మానవుని స్థితిని (Being) నిర్ణయించేది వారి చైతన్యం (Consciousness) కాదు; పైగా, వారి సామాజికస్థితే వారి చైతన్యాన్నీ నిర్ణయిస్తుంది."

మరో విధంగా చెప్పాలంటే ప్రకృతిలో వలెనే సమాజంలో కూడా స్థితి అనగా భౌతిక జీవితం ప్రధానమైనది. అదే సాంస్కృతిక జీవితాన్ని చైతన్యాన్ని నిర్ణయించే శక్తి.

సామాజిక చైతన్యం అంటే ఒకానొక సమాజంలోని రాజకీయ సిద్ధాంతాలు, న్యాయశాస్త్ర ప్రమాణాలు, మతసూత్రాలు, తాత్విక ధోరణులు, నైతికవిలువలు అని మార్క్సిజం చెబుతుంది; వీటితోబాటు సామాజికశాస్త్రాలు, కళలు, సామాజిక మనస్తత్వం (సామాజిక సంవేదనలు, ధోరణులు, ఆచారాలు వగైరా) కూడా సామాజిక చైతన్యం కిందికే వస్తాయి. సామాజిక అస్తిత్వం అంటే అర్థం, సమాజంలోని సమస్త క్లిష్టవిషయాలతో, వైరుధ్యాలతో కూడిన భౌతికజీవితం.

మొత్తం సమాజ స్వరూపాన్నీ, దాని నిర్మాణాన్నీ, దాని ఆలోచనలనూ, దాని సంస్థలనూ నిర్ణయించే ఈ సామాజిక భౌతిక జీవితం ఎలాంటిది? దాని స్పష్టమైన అర్థం ఏమిటి?

## 2. ఉత్పత్తివిధానం సామాజిక జీవితానికి భౌతికపునాది

సమాజంయొక్క భౌతిక జీవితాని కంతకూ కీలకం. ప్రజలు తమ జీవితావసరాలను, సౌకర్యాలను - ఆహారం, బట్టలు, ఇల్లు వగైరా - ఉత్పత్తి చేసుకునేటందుకు చేసే శ్రమ. ఈ ఉత్పత్తికార్యాలు ఎల్లప్పుడూ సహజసిద్ధంగా చేయవలసిన అనివార్య కార్యాలు; అత్యంత ప్రధానమైన విషయాలు; వీటిమీదనే మొత్తం సమాజమంతా ఆధారపడివుంటుంది.

1. లెనిన్: కలెక్టెడ్ వర్క్సు. మొదటి సంపుటి. పుట 140-141.

ఎంగెల్స్ చెప్పినట్లు, మానవజాతి రాజకీయాల్లోగాని, విజ్ఞానశాస్త్రంలోగాని, కళల్లోగాని, మతంలోగాని, ఏ యితర విషయాల్లోగాని పాల్గొనడానికి ముందు ఆహారం తినాలి: నీళ్ళు తాగాలి; ఇంట్లో నివసించాలి; బట్ట కట్టాలి.

ఉత్పత్తి క్రమానికి ఒకవైపు భౌగోళిక పరిసరాలు అనుకూలంగా ఉండాలి; రెండోవైపు జనాభా ఉండాలి. ఇవి ఉత్పత్తి క్రమానికి భౌతిక అవసరాలు. ఈ సహజ భౌతిక పరిస్థితులు సామాజికాభివృద్ధిపై గణనీయమైన ప్రభావం కలుగజేస్తున్నా, ఒకప్పుడు దాన్ని త్వరితంచేస్తూ మరొకప్పుడు నిరోధిస్తున్నా అవి చారిత్రకగతికి ప్రాతిపదిక కావు. ఒకే విధమయిన భౌగోళిక పరిసరాల్లో వేర్వేరు సామాజిక వ్యవస్థలుండవచ్చు; జనసాంద్రత వివిధ చారిత్రకపరిస్థితుల్లో వేర్వేరు ఫలితాల నీయవచ్చు.

బాహ్య పరిస్థితులలో క్రియారహితంగా పొందిక కుదుర్చుకునే జంతువులవలెకాక, మానవుడు తన పరిసరాలమీద క్రియాత్మక ప్రభావం కలుగజేస్తాడు. శ్రమద్వారా తన జీవితాని కవసరమైన భౌతిక విలువలను సృష్టించుకుంటాడు. ఇందుకతడు ప్రత్యేకమైన సాధనాలను ఉపయోగిస్తాడు; తయారుచేసుకుంటాడు. సమాజం ఈ ఉత్పత్తి సాధనాలను (Means of Production) తన అభీష్టాన్నిబట్టి ఎంచుకోజాలదు. జీవితంలో ప్రవేశించే ప్రతి కొత్తతరం అంతకుముందు తరాలవారి కృషి ఫలితంగా సృష్టింపబడిన ఉత్పత్తి సాధనాలను వారసత్వంగా పొందుతుంది. వాటి సహాయంతో ఉత్పత్తిని కొనసాగిస్తుంది. వాటిని క్రమక్రమంగా మెరుగుపరచుకుని మార్చుకుంటుంది.

అంతేకాదు; ఈ ఉత్పత్తి సాధనాలు ఒక నిర్దిష్టమైన క్రమంలో అభివృద్ధి చెందుతాయి. ఉదాహరణకు, మానవజాతి రాతి గొడ్డలినుంచి ఒక్కసారిగా అణువిద్యుత్ కర్మాగారానికి గంతువేయలేదు. ప్రతి కొత్త పరిశోధన, ప్రతి కొత్త సుళువు అంతకు ముందున్నవాటి ఆధారంపైనే సాధింపబడగలదు; ఒకానొక దేశం యొక్క, లేదా అంతకంటె అభివృద్ధి చెందిన మరొక దేశంయొక్క ప్రజలు క్రమక్రమంగా ఉత్పత్తిరంగంలో సంపాదించే అనుభవంమీద, నైపుణ్యంమీద, జ్ఞానంమీద అవి ఆధారపడవలసివుంటుంది.

అయితే, ఉత్పత్తిసాధనాలు తమంతటతాము పనిచేయవు. ఉత్పత్తి క్రమంలో ప్రధానపాత్ర వహించేది మానవులు; శ్రామిక ప్రజలు. వారికి నిర్దిష్టమైన నైపుణ్యం, పనిలో అనుభవం ఉండడంవల్ల ఆ పరికరాలను వారు తయారుచేసి ఉపయోగించుకోగలుగుతారు.

సమాజం సృష్టించే ఉత్పత్తి సాధనాలూ, ముఖ్యంగా భౌతిక సంపదను సృష్టించేటందుకు ఉపయోగపడే ఉత్పత్తి పరికరాలూ, ఒకానొక స్థాయికి చెందిన, అనుభవంతో ఉత్పత్తిక్రమంలో పాల్గొనే ప్రజలూ - కలిసి సమాజ ఉత్పత్తిశక్తులు (Productive Forces) అవుతాయి.

ఐతే, సమాజం యొక్క భౌతిక జీవితం దాని ఉత్పత్తిశక్తులకే పరిమితం కాదు.

సమాజంలో ఉత్పత్తి నిర్మానుష్యమైన ఒక ద్వీపంమీద జీవితం గడిపే రాబిన్‌సన్ క్రూసో వంటి వ్యక్తుల ద్వారా కాదు జరిగేది. అది ఎల్లప్పుడూ సామాజిక స్వభావాన్ని కలిగియుంటుంది. భౌతిక సంపదను ఉత్పత్తిచేసే క్రమంలో ప్రజలు తమకిష్టం వున్నా లేకపోయినా, ఒండొరుల మధ్య ఏదో ఒక రూపంలో సంబంధాలేర్పరచుకొని తీరాలి; ప్రతి ఉత్పత్తిదారు యొక్క శ్రమ సామాజిక శ్రమలోభాగం అవుతుంది. చరిత్ర యొక్క తొలిదశల్లో సహితం ప్రజలు తమ అస్తిత్వాన్ని నిలబెట్టుకొనేటందుకు ఒండొరులతో కలియవలసి వచ్చేది; అత్యంత పురాతనమైన పరికరాల సహాయంతో అడవి జంతువుల్నీ ప్రకృతి శక్తుల్నీ ఎదుర్కోవడం ద్వారాను, తదితర మార్గాల్లోను జీవితావసరాలను సంపాదించుకునేవారు. సామాజిక శ్రమవిభజన (Social division of labour) అభివృద్ధి చెందడంతో, కొందరు ప్రజలు మరికొందరిమీద ఆధారపడవలసిన అవసరం హెచ్చింది. ఉదాహరణకు, చేతివృత్తులు తలఎత్తడంతో రైతులు వృత్తిపనివారిమీద ఆధారపడసాగారు; వృత్తిపనివారు ఒకరిమీద ఒకరూ, అందరూ రైతులమీదా ఆధారపడసాగారు. ఈ విధంగా, ఉత్పత్తిదారులందరూ ఒండొరులమధ్య రకరకాలైన సంబంధాలేర్పరచుకోవలసి వచ్చింది.

ఈ సంబంధాలు వివిధ ఉత్పత్తిశాఖల్లో పనిచేసే ఉత్పత్తిదారుల మధ్య సంబంధాలకే పరిమితమై వుండవు. ఉత్పత్తిశక్తులు

అభివృద్ధిచెందేకొద్దీ, ఒకానొక దశలో సకల ఉత్పత్తిసాధనాలపై యాజమాన్యం - కనీసం ప్రధాన ఉత్పత్తి సాధనాలపై యాజమాన్యం - స్వయంగా ఉత్పత్తిచేసే వారి నుండి వేరుచేయబడుతుంది; సమాజంలోని కొద్దిమంది చేతుల్లో కేంద్రీకరింపబడుతుంది. అప్పటినుంచి ఉత్పత్తిదారులూ ఉత్పత్తిసాధనాలూ కలిసి వుండడం సాధ్యంకాదు; ఉత్పత్తిసాధనాల యజమానులూ, ఉత్పత్తిదారులూ కొన్ని సంబంధా లేర్పరచుకొంటేగాని ఉత్పత్తిక్రమం ప్రారంభం కాజాలదు. ఉత్పత్తిక్రమంలో ప్రజలమధ్య నెలకొనే సంబంధాలు వర్గాలమధ్య సంబంధాలుగా వుంటాయి. వర్గాలంటే (Classes), ఉత్పత్తిసాధనాలపై యాజమాన్యం కలిగివుండి ఇతరుల శ్రమ ఫలితాన్ని అనుభవించేవారూ; పూర్తిగాగాని, పాక్షికంగాగాని ఉత్పత్తిసాధనాలు లేకుండా చేయబడి, ఇతరుల కోసం పనిచేస్తేగాని పొట్టగడవనివారూను. ఇట్టివారు సమాజంలో పెద్ద సమూహాలుగా వుంటారు. ఉదాహరణకు పెట్టుబడిదారీ సమాజంలో పెట్టుబడిదారులు స్వయంగా పనిచేయరు. ఐనా, ఫ్యాక్టరీలను, మిల్లులను, రైల్వేలను కలిగియుండడంద్వారా, వారు కార్మికుల శ్రమఫలితాన్ని కొల్లగొట్టుకోగలరు. కార్మికులు తమ కిష్టమున్నా, లేకపోయినా పెట్టుబడిదార్లకు తమ శ్రమశక్తిని (Labour Power) అమ్ముకోడంద్వారానే జీవించగలరు. ఎందుచేతంటే, వారి చేతుల్లో ఉత్పత్తి సాధనాలు లేకుండా చేయబడ్డాయి.

భౌతిక విలువలను ఉత్పత్తిచేసే క్రమంలో ప్రజలమధ్య ఏర్పడే సంబంధాలు ఉత్పత్తి సంబంధాలు (Productive Relations) అని మార్క్సు, ఎంగెల్సులు నిర్వచించారు. వాటినే ఆర్థిక సంబంధాలని కూడా పిలుస్తారు.

ప్రజల మధ్య ఉత్పత్తిసంబంధాలు మానవ చైతన్యంతో నిమిత్తం లేకుండా, స్వతంత్రంగా వుంటాయి. ఈ అర్థంలో అవి భౌతిక సంబంధాలు ఉత్పత్తి సంబంధాల స్వభావం ఉత్పత్తిశక్తుల అభివృద్ధిపైన, స్వభావంపైన ఆధారపడి వుంటుంది. ఉదాహరణకు, బానిస యాజమాన్యం అమల్లో వున్నప్పుడుండే ఆర్థిక సంబంధాలు ఆదిమ సమాజంలో (Primitive Society) ఉండడం సాధ్యంకాదు. మొదటి కారణ మేమంటే, ఆదిమ సమాజంలో ఉత్పత్తిసాధనాలను (బలమైన కర్ర,

రాతిగొడ్డలి) అతి సులభంగా ఎవరైనా తయారు చేసుకోవచ్చు; వాటిపై ఇతరులకు ప్రత్యేకమైన యాజమాన్యపు హక్కు ఏర్పడ్డం అసాధ్యం. రెండవ కారణం, ఆ రోజుల్లో ఒకరి నొకరు దోచుకొనడం అసంభవమైన విషయం. ఆనాడు ఉత్పాదకత (Productivity) యొక్క స్థాయి చాల తక్కువగా వుండడంవల్ల తమకు బొటాబొటీగా సరిపడ్డవాటినే ఉత్పత్తి చేసుకోగలిగేవారు; పరులకష్టంపై ఆధారపడే వర్గాలను పోషించడం భౌతికంగా ఆనాడు అసాధ్యం.

ఈ ఒక్క ఉదాహరణనుబట్టే, ఉత్పత్తిక్రమంలో ప్రజల మధ్య ఏర్పడే సంబంధాలూ, ఉత్పత్తిశక్తులూ ఒకదానికొకటి దూరంగా కాకుండా, సన్నిహితంగా, ఐక్యతతో వుంటాయని తెలుసుకోవచ్చు. ఉత్పత్తిశక్తులకూ ఉత్పత్తి సంబంధాలకూ మధ్య ఈ ఐక్యతను చారిత్రక భౌతికవాదంలో ఉత్పత్తి విధానం అని వ్యవహరిస్తారు (Mode of production).

## ఉత్పత్తి అభివృద్ధి చెందే పద్ధతి

అతి ప్రాచీనకాలం నుంచి నేటివరకు సామాజికోత్పత్తి అవిరళంగా అభివృద్ధి చెందుతూంది. ఒక ఉత్పత్తి విధానం స్థానే మరొక ఉత్పత్తి విధానం - అంతకంటె ఉన్నతమైనది - అవతరిస్తూ వచ్చింది.

ఈ అభివృద్ధి యెలా సాగుతుంది? దాన్ని నడిపించేశక్తి ఏది?

వాస్తవ విషయాలను బట్టి బోధపడేది ఏమంటే, ఉత్పత్తి అభివృద్ధి చెందడానికి గల మూలకారణాలు ఆ అభివృద్ధిలోనే వున్నాయి; వాటి బయటకాదు. ఈ విషయాన్ని మార్క్స్ నొక్కి చెప్పాడు. చరిత్ర అంటే మానవజాతి యొక్క "స్వయంచోదక సామాజికస్థితి" అని నిర్వచించాడు.[2]

ప్రజలు శ్రమచేసేటప్పుడు బాహ్యప్రకృతిపై వారు క్రియాత్మక ప్రభావం కలుగజేసి దాన్ని మారుస్తారు. ప్రకృతిపై ప్రభావం కలుగజేస్తూనే వారు తమ్ముతాము మార్చుకుంటారు. ఉత్పత్తియొక్క అనుభవాన్నీ, శ్రమ నైపుణ్యాన్నీ, తమ చుట్టూవున్న ప్రపంచం గూర్చిన జ్ఞానాన్నీ వారు సంతరించుకుంటారు. వీటన్నిటి ఫలితంగా, వారు ఉత్పత్తి

---

2. కారల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగెల్స్: Selected Works, Foreign Languages Publishing House, 1958, Vol- I, Page 351

సాధనాలను, వాటి నుపయోగించే పద్ధతులను మెరుగుపరచుకో గలుగుతారు; కొత్త సాధనాలను కనిపెట్ట గలుగుతారు: ఉత్పత్తిక్రమంలో రకరకాలైన సుళువులను ప్రవేశపెట్ట గలుగుతారు. ఇలా ప్రవేశపెట్టే ప్రతి కొత్త సుళువుతోను ఇంకా కొత్త సుళువులు ఇంకా సరికొత్త పద్ధతులు ఒకదాని తరువాత ఒకటి తల ఎత్తుతాయి. ఇవన్నీ కలిసి ఒక్కొక్కప్పుడు సాంకేతికశాస్త్రంలో, శ్రామిక ఉత్పాదకతలో (Labour Productivity) నిజంగా ఒక విప్లవమే తెస్తుంది. వస్తుంది.

ఐతే ఇదివరకే చెప్పినట్లు ఉత్పత్తి కొనసాగాలంటే, మానవునికీ ప్రకృతికీ మధ్యనేకాక, ఉత్పత్తిలో పాల్గొనే ప్రజలమధ్య కూడా కొన్ని సంబంధాలుండితీరాలి. రెండోవైపు, ఈ సంబంధాలు ఉత్పత్తిశక్తుల అభివృద్ధిమీద ప్రభావం కలిగిస్తాయి. ఉత్పత్తిలో ప్రత్యక్షంగా పాల్గొంటున్న వారి కార్యకలాపాల ప్రేరణను ఉత్పత్తిసాధనాలపై యాజమాన్యం గల వర్గాల కార్యకలాపాలను అవి నిర్ణయిస్తాయి. ఉత్పత్తి సంబంధాల స్వభావం పైననే ప్రతి ఉత్పత్తి విధానం యొక్క ఆర్థికనియమాలూ, కార్మికుల స్థితిగతులూ, ఉత్పత్తిశక్తులపై ప్రభావం కలిగించే ఇతర పరిస్థితులూ ఆధారపడి వుంటాయి.

## ఉత్పత్తిశక్తుల, ఉత్పత్తి సంబంధాల మధ్య ప్రతిస్పందన

ఉత్పత్తి విధానంలో ఉత్పత్తిశక్తులకూ, ఉత్పత్తి సంబంధాలకూ మధ్య ఐక్యత ఉంటుందంటే అర్థం, వాటిమధ్య వైరుధ్యాలకు అవకాశం లేదనికాదు.

ఈ వైరుధ్యాలు తలఎత్తడానికి కారణం ఉత్పత్తివిధానంలోని రెండు పార్శ్వాలూ - అంటే ఉత్పత్తి సంబంధాలు, ఉత్పత్తిశక్తులు - వేర్వేరుమార్గాలలో అభివృద్ధిచెందడం. స్థూలంగా చెప్పాలంటే, ప్రజల సాంకేతికజ్ఞానం, ఉత్పత్తిలో వారి నైపుణ్యం, పనినైపుణ్యం - మొత్తం చరిత్రకు సంబంధించినవైనా, ఒక ప్రత్యేక ఉత్పత్తివిధానానికి సంబంధించినవైనా - దాదాపు అనవరతంగా అభివృద్ధి చెందుతాయి. ఉత్పత్తిలో అవి అత్యంత విప్లవాత్మకమైన, క్రియాత్మకమైన శక్తులు.

ఇక, ఉత్పత్తి సంబంధాల విషయమేమంటే, ఒకానొక ఉత్పత్తి విధానం అమల్లో వున్నపుడు ఉత్పత్తి సంబంధాలు కొన్ని మార్పులకు

లోనయ్యేప్పటికీ నిజమే అయినా ఈ మార్పులు వాటి కీలక స్వభావాన్ని మాత్రం మార్చవు ఉదాహరణకు ప్రస్తుతకాలంలో మనం చూస్తున్న ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారీ విధానానికీ (State monopoly capitalism) 19వ శతాబ్దపు పెట్టుబడిదారీ విధానానికి భేదం వుంది (ఈ విషయం తరువాత వివరింపబడుతుంది). కాని, పెట్టుబడిదారీ ఉత్పత్తిసంబంధాల ప్రాతిపదిక మాత్రం - ఉత్పత్తిసాధనాలన్నీ వ్యక్తుల యాజమాన్యం కింద వుండడం - ఒకటే. అందుచేత, పెట్టుబడిదారీవిధానం యొక్క ప్రధాన నియమాలు యిప్పటికీ వర్తిస్తున్నాయి. ఆస్తి సంబంధాల్లో తీవ్రమైన మార్పులు సంభవిస్తే అవి తప్పకుండా గుణాత్మకస్వభావం కలిగివుంటాయి; క్రమానుగతమార్పు అక్కడితో ఆఖరవుతుంది; పాత ఉత్పత్తిసంబంధాలు నిర్మూలనమై కొత్తవి తలయెత్తుతాయి. అంటే, మరొక ఉత్పత్తివిధానం ఆవిర్భవిస్తుంది.

అందుచేత, సోషలిస్టు యుగం వచ్చేవరకూ ప్రతి ఉత్పత్తి విధానం యొక్క చరిత్రలోనూ ఉత్పత్తి సంబంధాలకూ, ఉత్పత్తి శక్తులకూ మధ్య సమన్వయం ఎందుచేత తాత్కాలికంగా మాత్రమే ఉంటుందో స్పష్టమౌతుంది. సాధారణంగా అట్టి సమన్వయం ఉత్పత్తి విధానంయొక్క ప్రారంభ దశలో మాత్రమే అమల్లో ఉంటుంది. అంటే, ఒకానొక స్థాయికి చెందిన ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి తగినట్లుగా కొత్త ఉత్పత్తి సంబంధాలు నెలకొన్న దశలోనే అట్టి సమన్వయం ఏర్పడుతుంది. కాని ఆ తర్వాత సాంకేతిక విజ్ఞానం, పని నైపుణ్యం, అనుభవం, విషయ పరిజ్ఞానం వీటి అభివృద్ధి ఆగిపోదు; పైగా అవి త్వరితంగా అభివృద్ధి చెందుతాయి. ఈ విధంగా, ఉత్పత్తిశక్తులపై ఉత్పత్తి సంబంధాలు క్రియాత్మకమైన ప్రభావం కలుగజేస్తాయని స్పష్టంగా ద్యోతకమవుతుంది. ఆస్తి సంబంధాలు ఉత్పత్తిశక్తుల కనుగుణంగా ఉన్నప్పుడు వాటి అభివృద్ధి కొంత సౌమ్యంగా నిరాటంకంగా సాగుతుంది.

అయితే, ఉత్పతి సంబంధాలు వాటంతట అవి ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి అనుగుణంగా నిరంతరాభివృద్ధి చెందవు. వర్గ సమాజంలో యీ సంబంధాలు ఒకసారి ఉత్పన్నమయిన తర్వాత న్యాయశాస్త్రంలోను, రాజ్యాంగంలోను సంఘటితమవుతాయి. యాజమాన్యరూపాల్లోను,

చట్టరూపాల్లోను, వర్గరాజకీయాల్లోను, రాజ్యాంగయంత్రం (State) తదితర వ్యవస్థల్లోను అవి స్థిరపడతాయి.

ఉత్పత్తిశక్తులు అభివృద్ధి చెందేకొద్దీ, వాటికీ ఉత్పత్తి సంబంధాలకూ మధ్య అనివార్యంగా ఏర్పడే వైరుధ్యం క్రమేణా సంఘర్షణగా రూపొందుతుంది. ఎందుచేతంటే, పాతబడిన ఉత్పత్తి సంబంధాలు - ఉత్పత్తిశక్తుల యితోధికాభివృద్ధిని ఆటంకపరుస్తాయి.

ఉదాహరణకు, ఫ్యూడల్ సమాజంలో భూమిపై యాజమాన్యం ఫ్యూడల్ భూస్వాములది; రైతులు ఆ భూమికి బంధింపబడి వుండేవారు. ఈ పద్ధతిపై ఆధారపడ్డ సంబంధాలు ఒకప్పుడు ఉత్పత్తిశక్తుల కనుగుణంగా వుండేవి; అందుచేత వాటి అభివృద్ధికి సహాయపడేవి. కాని పరిశ్రమలు (కార్ఖానాలూ, ఆ తర్వాత యంత్రపరిశ్రమలు) విపరీతమైన వేగంతో అభివృద్ధిచెంద నారంభించాక పరిస్థితి మారిపోయింది. అర్ధబానిసవిధానం (Serfdom) పరిశ్రమల అభివృద్ధికి ఆటంకంగా పరిణమించింది. వ్యక్తిగత స్వేచ్ఛగల కార్మికులు పరిశ్రమల కవసరమయ్యారు. వారిచేతుల్లో ఉత్పత్తి సాధనా లేవీ లేకుండా వుండాలి; ఆకలి వారిని మిల్లులకూ, ఫ్యాక్టరీలకూ తరిమేటట్లు చేయాలి; పెట్టుబడిదార్లకింద వారు ఊడిగంచేసే పరిస్థితి వుండాలి. ఉత్పత్తిశక్తులకూ, ఉత్పత్తి సంబంధాలకూ మధ్య వైరుధ్యమేర్పడుతుం దనడానికి ఆధునిక పెట్టుబడిదారీవిధానం కూడా ఒక ఉదాహరణ. విధ్వంసకర సంక్షోభాలు, యుద్ధాలు, ఆర్థికాభివృద్ధిలో మాంద్యం మొదలైన రూపాల్లో యీ వైరుధ్యం వ్యక్తమవుతోంది.

ఉత్పత్తిశక్తులకూ, ఉత్పత్తి సంబంధాలకూ మధ్య జరిగే సంఘర్షణవల్ల వివిధ సామాజిక రంగాల్లో వైరుధ్యాలు, ముఖ్యంగా వివిధ వర్గాలమధ్య వైరుధ్యాలు, తీవ్రమవుతాయి. కొన్ని వర్గాలు పాత ఉత్పత్తి సంబంధాలను యథాప్రకారంగా ఉంచాలనీ, మరికొన్ని వర్గాలు పరిణతి చెందుతూన్న కొత్త ఉత్పత్తి సంబంధాలను ప్రోత్సహించాలనీ కోరుతాయి.

ఎప్పుడో ఒకప్పుడు యీ సంఘర్షణ విప్లవంద్వారా పరిష్కరింపబడుతుంది. అంటే, విప్లవంద్వారా పాత ఉత్పత్తి సంబంధాలు రద్దుచేయబడి, వాటి స్థానంలో కొత్త ఉత్పత్తి సంబంధాలు

నెలకొల్పబడతాయి. ఈ కొత్త ఉత్పత్తి సంబంధాలు అభివృద్ధి చెందిన ఉత్పత్తిశక్తుల స్వభావాని కనుగుణంగా, వాటి యితోధికాభివృద్ధికి తగినట్లు వుంటాయి. ఒక నూతన ఉత్పత్తి విధానం ఆవిర్భవిస్తుంది. దానితో ఒక నూతన చక్రక్రమం - అంతకంటే ఉన్నత దశలో ప్రారంభమవుతుంది. అది యిదివరకటి దశల్లోనే పరిభ్రమిస్తుంది. శత్రువర్గాలుండే సమాజాల్లో తిరిగి పాత ఉత్పత్తి విధానం రద్దయి కొత్త విధానం ప్రారంభమవడానికి అది దారితీస్తుంది.

## 3. పునాది *(Basis)*, ఉపరినిర్మాణం *(Superstructure)*

ఉత్పత్తి శక్తులు - ప్రజలమధ్య ఉత్పత్తి సంబంధాలను, అనగా సమాజం యొక్క ఆర్థికవ్యవస్థను, నిర్ణయిస్తుందని పైన చూచాం. ఈ ఆర్థికవ్యవస్థ తిరిగి సమాజానికంతకు పునాది అవుతుంది. దానిమీద అనేక విధాలైన సామాజిక సంబంధాలు, భావాలు, వ్యవస్థలు లేస్తాయి. ఒకానొక పునాదిమీద లేచే సామాజిక భావాలూ (రాజకీయ, న్యాయశాస్త్ర, తాత్విక, , మత - యిత్యాది), రకరకాలైన సంస్థలూ, వ్యవస్థలూ (రాజ్యాంగయంత్రం, మతం, రాజకీయ పార్టీలు వగైరా) ఆ సమాజం యొక్క ఉపరినిర్మాణం అవుతుంది. అంత్య పరిశీలనలో ఉత్పతి విధానమే ఒకానొక సమాజంలోని అన్ని జీవిత రంగాలనూ నిర్ణయిస్తుందనీ, ఆర్థిక, రాజకీయ సంబంధాలకూ యితర సంబంధాలకూ మధ్యనున్న సంబంధాన్ని కూడా అది వెల్లడిస్తుందనీ మనకు బోధిస్తుంది.

చరిత్రలో ప్రతి సమాజానికీ ఒక నిర్దిష్టమైన పునాది, దానికనుగుణమైన ఉపరినిర్మాణం ఉండితీరుతాయి.

సామాజిక విభజన, వర్గసంపుటి (Class composition) యివి ప్రచలిత యాజమాన్య రూపాలపై ఆధారపడి వుంటాయి; తిరిగి ఈ వర్గసంపుటి సమాజంయొక్క రాజకీయ సంస్థలను, న్యాయశాస్త్ర ప్రమాణాలను నిర్ణయిస్తుంది. ఉదాహరణకు, సోషలిజంలో రాచరిక వ్యవస్థ (Monarchy) ఊహించడానికైనా వీల్లేని విషయం; బానిస సమాజంలో వయోజన ఓటింగు అసాధ్యమైన సంగతి. ఫ్యూడల్ ఉత్పత్తి సంబంధాల్లో రైతు భూస్వామిమీద భౌతికంగానేకాక, వ్యక్తిగతంగా కూడా ఆధారపడవలసి యుంటుంది (అర్ధబానిస విధానం). ఇది ఫ్యూడల్

న్యాయశాస్త్రంలో వ్యక్తమవుతుంది. అంటే, ఫ్యూడల్ చట్టాలు రైతులకూ భూస్వాములకూ మధ్య అసమాన హోదానే గుర్తిస్తాయి.

ఫ్యూడల్. ఉత్పత్తిసంబంధాలు పెట్టుబడిదారీ ఉత్పత్తిసంబంధాలుగా మారినప్పుడు న్యాయశాస్త్ర సంబంధాల్లోకూడ మార్పు వచ్చింది. ప్రత్యక్షంగా బలప్రయోగంచేసే పద్ధతికి బదులు, వ్యక్తుల్ని పరాధీనస్థితిలో వుంచడానికి బదులు "ఆకలికొనితెచ్చే శిక్షణ" ప్రత్యక్షమయింది. దానితో, చట్టం కార్మికునికీ పెట్టుబడిదారుకూ మధ్య సమానహోదాను (పేరుకుమాత్రం) గుర్తించవలసివచ్చింది. కాని బూర్జువా న్యాయశాస్త్రం వ్యక్తిగత ఆస్తి విధానంమీద ఆధారపడ్డంచేత అది ప్రకటించే సమానత్వం నిజానికి ఆస్తిపరవర్గాల పెత్తనాన్ని బలపరచేదిగానే వుంటుంది. అందుచేత రాజ్యాంగ, న్యాయశాస్త్ర సంబంధాలు ఆర్థిక సంబంధాలనుంచి ఉద్భవిస్తాయి; వాటిచే నిర్ణయింపబడతాయి.

తాత్విక, మత, నైతిక, కళాత్మక, తదితర భావాల విషయం కూడా యింతే. ఉదాహరణకు, ఆదిమసమాజంలో వివిధ తెగల మధ్య యుద్ధాలు జరిగేటప్పుడు ఖైదీలుగా పట్టుకోబడిన వారిని చంపివేసేవారనీ, కొన్ని సందర్భాల్లో తినివేసేవారనీ మన మెరుగుదుం. ఆ తర్వాత వారిని బానిసలుగా ఉపయోగించుకోడం ఆచారమయింది. ఎందుకు ఆ విధంగా సామాజికనీతి "సౌమ్య" మొనర్చబడింది? ఎందుచేతంటే శ్రామిక ఉత్పాదకత అభివృద్ధిచెందడంతో, యితరుల శ్రమఫలితాన్ని కాజేయడం, అంటే మనిషిని మనిషి దోచుకోడం సాధ్యమయింది. ఈ ఆర్థిక ప్రాతిపదికమీదనే బానిసయుగపు నూతన దృక్పథాలు, ఆచారాలు తలయెత్తాయి.

సోషలిజంకింద రూపొందే నూతన ఉత్పత్తి సంబంధాలు ప్రజల అభిప్రాయాలను, నైతిక విలువలను, ప్రవర్తనలను మూలమట్టంగా మార్చివేస్తాయి. పెట్టుబడిదారీ విధానంలో చట్టావ్యాపారం డాక్టరు వృత్తిలాగే, ప్లీడరు వృత్తిలాగే ఒక వృత్తిగా భావింపబడుతోంది. దాన్ని కొంత అదుపులో ఉంచడమైతే చేయవచ్చు (పెద్ద చట్టావ్యాపారుల కనుకూలంగాను, చిన్న చట్టావ్యాపారులకు వ్యతిరేకంగాను). అయితే చట్టావ్యాపారం మాత్రం చట్టబద్ధమైనదే. ఇట్టి కార్యాలకు ఉపయోగపడే సంస్థలు కూడా (స్టాక్ ఎక్ఛేంజి వగైరా) చట్ట సమ్మతమైనవే. ఇతరుల

శ్రమ ఫలితాన్ని కొల్లగొట్టుకోడం చట్ట సమ్మత మొనర్చబడిన సమాజంలో, ప్రపంచంలో దేనికీ లేని విలువ ద్రవ్యానికే వున్న సమాజంలో, సమస్త సుగుణాలకు కొలబద్ద ద్రవ్యమే అయిన సమాజంలో – యింతకంటె మరొక విధంగా పరిస్థితి ఉండదు. కాని సోషలిజంలో యిట్టి పనులను సమాజం నైతికంగా ఖండిస్తుంది; అంతేకాక చట్టరీత్యా నేరస్తుల్ని శిక్షిస్తుంది.

పునాది – ఉపరి నిర్మాణాన్ని నిర్ణయిస్తుంది. దీన్నిబట్టి, మన మొక పర్యవసానానికి వస్తాం. అదేమంటే, పునాది మార్పు చెందినప్పుడల్లా, అంటే ఉత్పత్తి సంబంధాలు మారినప్పుడల్లా, ఉపరి నిర్మాణం కూడా మారుతుంది. అంటే, రాజ్యాంగయంత్రం, న్యాయశాస్త్రం, రాజ్యాంగసంబంధాలు, నైతిక విలువలు, సిద్ధాంత ధోరణులు – యివన్నీ తీవ్రంగా మార్పుచెందుతాయి. రెండోవైపు, ఉపరి నిర్మాణం ఉత్పత్తి సంబంధాలపై ప్రభావం కలిగిస్తుంది. వాటి స్థానంలో కొత్త ఉత్పత్తి సంబంధాలు ఆలస్యంగానో, త్వరితంగానో ఏర్పడేటట్లు అది చేయగలదు. ఉదాహరణకు, ఆధునిక బూర్జువావర్గ రాజ్యాంగసంస్థలూ (ప్రధానంగా రాజ్యాంగయంత్రం), న్యాయశాస్త్రం, సిద్ధాంతం పెట్టుబడిదారీ యాజమాన్యాన్ని అట్టేపెట్టి వుంచడంలో, దాని స్థానే ఏనాడో యేర్పడవలసిన సోషలిస్టు (ప్రజా) యాజమాన్యం వాయిదా పడేటట్లు చేయడంలో ముఖ్యమైన పాత్ర నిర్వహిస్తున్నాయి.

ఏ వర్గ సమాజంయొక్క ఉపరి నిర్మాణంలోనైనా సరే పాలకవర్గం యొక్క భావాలే, సంస్థలే ప్రబలంగా ఉంటాయి. కాని వీటితోబాటు పీడిత ప్రజల భావాలు, సంస్థలుకూడ ఉపరినిర్మాణంలో భాగాలే. వీటి సహాయంతో ఆ వర్గాలు తమ ప్రయోజనాలకై పోరాడుతాయి.

ఈ విధంగా, బూర్జువా సమాజం కార్మికులు – పెట్టుబడిదార్లు అనే వర్గాలుగా విడిపోవడం అనేది ఈ ఉభయవర్గాల చైతన్యంలోను త్వరగానో ఆలస్యంగానో ప్రతిబింబించకమానదు. దీని ఫలిత మేమంటే, బూర్జువా వర్గ సిద్ధాంతం, సంస్థలతోబాటు – రాజ్యాంగయంత్రం, రాజకీయ పార్టీలు, పత్రికలు వగైరా – సమాజంలో కార్మికవర్గ సిద్ధాంతం, సంస్థలుకూడా అభివృద్ధి చెందుతాయి. తా మొక ప్రత్యేక వర్గమనే చైతన్యం కార్మికుల్లో త్వరగాగాని, ఆలస్యంగాగాని కలుగుతుంది. తమ

ఉమ్మడి ప్రయోజనాలను గురించి వారు తెలుసుకుంటారు; వాటికీ పెట్టుబడిదార్ల ప్రయోజనాలకూ పొత్తు ఉండదని అర్థం చేసుకుంటారు. ఈ విధంగా, కార్మికులు తమ వర్గ ప్రయోజనాలను గురించి తెలుసుకోవడంతో, వారు పెట్టుబడిదార్లకు వ్యతిరేకంగా ఉమ్మడిపోరాటం జరపడానికి ఐక్యంకా నారంభిస్తారు. కార్మికవర్గంలో పురోగాములైనవారు ప్రత్యేక రాజకీయపార్టీలో సంఘటితులవుతారు. ట్రేడ్ యూనియన్లు, తదితర కార్మికసంస్థలు నెలకొల్పబడతాయి. శ్రామికవర్గాన్ని వర్గసంస్థల్లో - రాజకీయపార్టీ, ట్రేడ్ యూనియన్లు - కలిసి వుంచే సంబంధాలు ప్రజల చైతన్యం ద్వారా వృద్ధికావలసిందే. ఆ తర్వాతనే అవి ఒక స్థిరమైన రూపం ధరిస్తాయి. ఎందుచేతంటే, కార్మికులు చైతన్యంతో, సిద్ధాంత పరిజ్ఞానంతో, స్వచ్ఛందంగా ఒక రాజకీయపార్టీలో చేరుతారు. క్రమంగా వారిలో వర్గఐక్యత పెంపొందుతుంది; పాలకవర్గమైన పెట్టుబడిదార్ల నీతికి భిన్నమైన నీతిని కార్మికవర్గ నీతిని వారు అలవరచుకుంటారు.

ఈ విధంగా, వర్గ సంబంధాల పునాదిపై రకరకాలైన ప్రపంచ దృక్పథాలు, సామాజిక ధోరణులు, రాజకీయ తదితర సంస్థలు, ఉపరి నిర్మాణానికి సంబంధించిన సకల విషయాలూ ఒక బ్రహ్మాండమైన పిరమిడ్ మాదిరిగా రూపొందుతాయి.

ఏ సమాజంలోనూ దాని పార్శ్వాలన్నీ - ఉత్పత్తిశక్తులు, ఆర్థిక విధానం, రాజకీయాలు, సిద్ధాంతం వగైరా - యాదృచ్ఛికంగా కలియవు.

ఉత్పత్తిశక్తుల స్వభావాన్ని బట్టీ, వాటి అభివృద్ధి స్థాయిని బట్టీ ఉత్పత్తి సంబంధాలేర్పడతాయి. ఈ ఉత్పత్తి సంబంధాలనే పునాదిపై రాజకీయ, సిద్ధాంత ఉపరినిర్మాణం ఏర్పడుతుంది. అందుచేత ప్రతి సమాజం ఒక సమైక్య అంగనిర్మాణం; ఒక సాంఘిక రాజకీయవ్యవస్థ; అంటే, ఒక ప్రత్యేకమైన ఉత్పత్తి విధానమూ, పునాదీ, ఉపరినిర్మాణమూ గల చారిత్రక సామాజిక దశ.

సాంఘిక, ఆర్థిక నిర్మాణ రూపమనే భావన మొత్తం సమాజ విజ్ఞానశాస్త్రానికంతటికీ చాలా ప్రాధాన్యం వహిస్తుంది. సమాజంలో అసంఖ్యాకమైన వివరాలు, ప్రత్యేకతలు ఉన్నప్పటికీ, ప్రజలందరూ

ఎందుచేత ప్రధానంగా ఒకేమార్గంలో నడుస్తారో అర్థంచేసుకోడానికి ఇది అవకాశమిస్తుంది. ప్రతి జాతియొక్క చరిత్ర ఉత్తరోత్తరా ఉత్పత్తిశక్తుల అభివృద్ధిచే నిర్ణయింపబడుతుంది. ఈ ఉత్పత్తిశక్తుల అభివృద్ధి ఒకే ఒక విధమైన అంతరిక నియమాల ప్రకారం జరుగుతుంది. ఒక సాంఘిక, ఆర్థిక నిర్మాణ రూపంస్థానే మరొక సాంఘిక, ఆర్థిక నిర్మాణరూపం ఒకదాని తర్వాత ఒకటి కొన్ని నిర్దిష్టమైన నియమాల ప్రకారం తలెత్తుతూండడం ద్వారా సమాజం అభివృద్ధి చెందుతుంది. అంతేగాక, ఇతర జాతులకంటె అభివృద్ధిదశలో వున్న ఒకజాతి – ఆ ఇతర జాతులకు వాటి భవిష్యత్ మార్గాన్ని చూపుతుంది; అదేవిధంగా ఆ ఇతరజాతులు ఈ జాతియొక్క గతాన్ని సూచిస్తాయి.

సాంఘిక, ఆర్థిక నిర్మాణ రూపాలనే సిద్ధాంతం – మానవజాతి చరిత్రను గురించిన మాయావాద భావనలను తొలగించి, అందరూ దానిని తెలుసుకొనగలిగేటట్లు చేస్తుంది. లెనిన్ ఇలా రాశాడు:

“ఇదివరలో చరిత్రను గురించీ, రాజకీయాలను గురించీ అస్తవ్యస్తమైన అభిప్రాయాలు, ఎవరికితోచిన పద్ధతిలో అవి వ్యాప్తిలో వుండేవి. వాటి స్థానంలో ఇప్పుడు స్పష్టంగా ఏకీకృతమైన సమన్వయ పూర్వకమైన శాస్త్రీయ సిద్ధాంతమొకటి రూపొందింది. అది, ఉత్పత్తిశక్తుల అభివృద్ధి ఫలితంగా ఒక సామాజిక వ్యవస్థకు బదులు అంతకంటె ఉన్నతమైన వ్యవస్థ ఏ విధంగా అభివృద్ధిచెందుతుందో తెలియజేస్తుంది.”[3]

## 4. చరిత్ర అంటే సామాజిక, ఆర్థిక నిర్మాణ రూపాల అభివృద్ధి, మార్పు

చారిత్రక భౌతికవాదం ముందే తా నేర్పరచుకున్న కొన్ని అభిప్రాయాలను చరిత్రకు ఆపాదించదు; ఇదివరకు జరిగిన, ఇప్పుడు జరుగుతున్న ఘటనలను తన స్వంత నిర్ధారణల్లోకి చొప్పించదు. పైగా చరిత్రను గురించి అది శాస్త్రీయంగా సామాన్యీకరించి (Generalise) చెబుతుంది.

---

3. లెనిన్: Works సంపుటి 19, పుట 5: The three sources and three component parts of Marxism, Moscow 1959, పుట 9.

ఒకదాని తరువాత ఒకటిగా తలెత్తిన సామాజిక, ఆర్థిక నిర్మాణ రూపాలే మానవజాతి చరిత్ర అనే నిర్ధారణ గతాన్ని గురించిన జ్ఞానంపై, శాస్త్రీయంగా రుజువైన జ్ఞానంపై ఆధారపడివుంది. మొత్తం మానవజాతి నాలుగు నిర్మాణరూపాల్లో - ఆదిమ కమ్యూనిస్టు, బానిస, ఫ్యూడల్, పెట్టుబడిదారీ రూపాల్లో - అభివృద్ధి చెందింది. ప్రస్తుతం అది తరువాతి రూపమైన కమ్యూనిజాన్ని చేరుకొనే పరివర్తన దశలో ఉంది. కమ్యూనిజంలో మొదటిదశ సోషలిజం.

ఈ కింద మేము ఒక్కొక్క సాంఘిక, ఆర్థిక నిర్మాణ రూపం యొక్క అత్యంత సాధారణమైన లక్షణాలను చూద్దాం. వివరాలలోకీ, తక్కువ ప్రాధాన్యంగల లక్షణాలలోకీ వెళ్ళద్దు. - ఇలాంటివి ప్రతి దేశచరిత్రలోను, ప్రతి యుగంలోను కొల్లలుగా వుంటాయి.

## ఆదిమ కమ్యూనిస్టు వ్యవస్థ

మానవుడు జంతుదశనుంచి అభివృద్ధి చెందాక ఏర్పడ్డ మొదటి సామాజిక స్వరూపం ఆదిమ కమ్యూనిస్టు వ్యవస్థ. మానవుడు దీర్ఘకాలం చేసిన శ్రమ ఫలితంగా ఇతర జీవరాసులకు లేని కొన్ని ప్రత్యేక లక్షణాలను అలవరచుకున్నాడు.

ఆదిమ కమ్యూనిస్టు వ్యవస్థయొక్క తొలిదశల్లో మానవుని ఉత్పత్తి సాధనాలు అత్యంత ప్రాచీనమైనవి; బలమైనకర్ర, రాతిగొడ్డలి, పల్చనిచాకు, రాతి మొన గలిగిన బల్లెం, ఆ తరువాత విల్లంబులు. ఆ రోజుల్లో మానవుడు తన కండరాల శక్తితోనే అన్ని పనులూ చేసేవాడు.

ఈ విధమైన ఉత్పత్తిశక్తుల స్థాయి కనుగుణంగా ప్రజల మధ్య ఉత్పత్తి సంబంధాలుండేవి. ఆనాడు మానవునికి అందుబాటులోవున్న పరికరాలతో ఒంటరిగా ప్రకృతిశక్తుల్ని ఎదుర్కొంటూ, జీవితావసరాలను సంపాదించుకోవడం అసాధ్యమైన విషయం. ఆదిమ కమ్యూన్‌లోని వారందరూ సమష్టిగా పనిచేయడంవల్లనే (కలిసి వేటాడ్డం, చేపలుపట్టడం వగైరా), కలిసి జీవించడం వల్లనే, ఒండొరులు సహాయం చేసుకోవడం వల్లనే జీవితావసరాలను సంపాదించుకోగలిగేవారు. కలిసి శ్రమ చేయాలంటే, ఉత్పత్తి సాధనాలు కూడా సమష్టి ఆస్తిగా వుండవలసి

వచ్చింది. ఇదే, ఆ యుగంలో ఉత్పత్తి సంబంధాలకు ప్రాతిపదిక. కమ్యూన్‌లో నివసించే వారందరూ ఉత్పత్తి సాధనాల విషయంలో ఈ విధమైన సంబంధాల్నే కలిగి వుండేవారు. ఎవరూ ఇతర కమ్యూన్ సభ్యుల ఉత్పత్తి సాధనాలను లాక్కొని తమ స్వంత ఆస్తిగా చేసుకోడానికి వీలులేదు.

సొంత ఆస్తి (Private Property) లేకపోవడంవల్ల, ఒక మనిషిని మరొకమనిషి దోచుకోవడానికి వీలులేదు. ఆనాటి ఉత్పత్తి పరికరాలు సమష్టిగా ఉపయోగంలో ఉన్నప్పటికీ, వాటివల్ల బహుకొద్ది జీవితావసరాలే లభ్యమయేవి. ఒక్కొక్కవ్యక్తికి సరిపడీ సరిపడని తిండిమాత్రమే లభించేది. ఉత్పత్తిదారులనుంచి అపహరించడానికి అదనంగా ఏమీ మిగిలేదికాదు; అందుచేత ఇతరులకది లభించేది కాదు. ఇతరుల శ్రమఫలితాన్ని కాజేయడం ఆ రోజుల్లో లేదుగనుక, కొందరిమీద మరికొందరు బలప్రయోగం చేయడానికి ప్రత్యేకమైన యంత్రాంగం కూడా అవసరం లేకపోయింది. ఉమ్మడి వ్యవహారాలను సులభంగానే సర్దుబాటు చేసుకొనేవారు.[1] అందరూ కలిసిగాని, అందరికంటె అనుభవం కలిగిన, ఎక్కువ గౌరవం గలిగిన వారుగాని ఈ పనులు చేస్తూండేవారు.

కాబట్టి ఈ నిర్మాణ రూపం యొక్క ప్రత్యేక లక్షణాలు ఉత్పత్తి యొక్క హీనస్థాయిని బట్టీ, అతి బలీయమైన ప్రకృతిశక్తులముందు మానవుని నిస్సహాయతనుబట్టీ నిర్ణయింపబడ్డాయి. ఈ యుగంలో ప్రజల చైతన్యం మరీ అమాయకమైన మత భావాలచే శాసింపబడేది. వారు గుడ్డిగా ఆచారాలకు, సంప్రదాయాలకు తలవొంచేవారు. గణం, లేక తెగయే వారి ప్రపంచమంతా; దాని బయట జరిగేవన్నీ నిషిద్ధాలు; తెగలమధ్య యుద్ధాలు, రక్తపాతం జరిగేవి. ఆదిమ కమ్యూనిస్టు వ్యవస్థలో దోపిడీ విధానపు వికృతాలు, వైకల్యాలు లేకపోయినప్పటికీ, అది మానవుని "స్వర్ణయుగం" మాత్రం కాదు.

కాలం గడచినకొద్దీ ఆదిమ కమ్యూనిస్టు వ్యవస్థ పతనావస్థకు చేరుకుంది. ఆదిమ సమాజం నశించడానికి అంతిమ కారణం ఉత్పత్తిశక్తులు అభివృద్ధిచెందడం. ప్రజలు క్రమంగా లోహాలను కరిగించే రహస్యాన్ని తెలుసుకుని, అందులో ప్రావీణ్యం సంపాదించారు. రాతి, కొయ్యపనిముట్ల స్థానే లోహపు పనిముట్లు వచ్చాయి. లోహపుకర్రు

బిగించిన నాగళ్ళు, లోహపు గొడ్డళ్లు, బల్లేల చివర బాణాలచివర ఇనుము లేక కంచు మొనలు విస్తృతంగా వ్యాప్తిలోకి వచ్చాయి. వ్యవసాయం మరింత అభివృద్ధి చెందింది. పశువుల్ని పెంచడంవల్ల, భూమి దున్నేటందుకు, పశుశక్తిని ఉపయోగించడంవల్ల ఉత్పత్తిశక్తుల శ్రామిక ఉత్పాదకత (Labour Productivity) బాగా హెచ్చింది. ఉత్పత్తిశక్తుల అభివృద్ధి - ఉత్పత్తి సాధనాలు, పనివారల నైపుణ్యం, అనుభవం - తీవ్రమైన సామాజిక మార్పులకు దారితీసింది. సామాజిక శ్రమవిభజన తలయెత్తింది. వ్యవసాయం, పశువుల పెంపకం, ఆ తరువాత చేతివృత్తులు ప్రత్యేక ఉత్పత్తిశాఖలుగా రూపొందాయి. శ్రమవల్ల ఉత్పత్తి అయిన వస్తువులను మొదట తెగలమధ్య, ఆ తరువాత కమ్యూన్ సభ్యులమధ్య మార్పిడి చేసుకోవడం (ఇచ్చి పుచ్చుకోవడం) ప్రారంభమైంది. క్రమంగా మొత్తం కమ్యూన్ కలిసి పనిచేయవలసిన అవసరం పోయింది. ఒక్కొక్క తెగ, గణం కొన్ని కుటుంబాలుగా చీలిపోయాయి. ప్రతి కుటుంబం ఒక స్వతంత్ర ఆర్థిక యూనిటుగా తయారైంది. శ్రమ వివిధ శాఖలుగా విభజింపబడింది; సొంత ఆస్తి తలయెత్తింది; దానితోబాటు పరుల శ్రమను దోచుకొనేందుకు అవకాశం ఏర్పడింది. ఎందుచేతంటే, ఉత్పత్తి బాగా అభివృద్ధిచెంది, మానవుని శ్రమశక్తితో పనివారల జీవితావసరాలకు మించి వస్తువులను తయారుచేయగల స్థితి ఏర్పడింది.

ప్రజలు అవసరాలను బట్టీ, పనిని సులభం చేసుకోవాలనే కోర్కెను బట్టీ, ప్రకృతి వైపరీత్యాలలో జీవితావసర వస్తువులు నాశనం కాకుండా ముందునుంచీ నిల్వ చేసుకోవాలనే కాంక్షవల్లా - తమ ఉత్పత్తి పరికరాలను మెరుగుపరచుకోసాగారు. కాని, వారు ఉత్పత్తి పరికరాలలో ఆ విధంగా మార్పు తీసుకురావడం ద్వారా, తలవనితలంపుగా, ఉద్దేశరహితంగా తమ చర్యవల్ల ఎట్టి సామాజిక ఫలితాలు కలుగుతాయో అనుమానం కూడా లేకుండా ఒక బ్రహ్మాండమైన సామాజిక విప్లవానికి మార్గం సుగమంచేశారు. ఆదిమ కమ్యూనిస్టు నిర్మాణం స్థానే బానిస వ్యవస్థ రూపొందింది. సామాజిక ఉత్పత్తిశక్తులు విస్తరించడంవల్ల ప్రజల మధ్య కొత్త ఉత్పత్తి సంబంధాలు ఏర్పడవలసి వచ్చింది.

## బానిస విధానం

ఈ విధానంలో ఉత్పత్తి సంబంధాలకు ప్రాతిపదిక, ఉత్పత్తి సాధనలేగాక పనివారుకూడా - అంటే బానిసలు - సొంత ఆస్తిగా వుండడం, బానిసల పైనా, వారు ఉత్పత్తిచేసే వాటన్నిటిపైనా బానిస యజమానికి పూర్తిహక్కు వుంటుంది. ఈ హక్కు ఆనాటి ఉత్పత్తిశక్తుల స్థాయినిబట్టి ఏర్పడింది. ఈ స్థాయి శ్రామిక ప్రజల్ని దోచుకునేటందుకు అవకాశమిచ్చేటంత అధికంగా వుంది. కాని, అదే సమయంలో శ్రామిక ప్రజల్ని దోచుకోవాలంటే, వారి శ్రమ ఫలితంలో కొంతభాగాన్ని కాజేయాలంటే, వారికి కడుహీనమైన జీవితావసరాలు మాత్రమే ఇవ్వగలిగేవారు. అంతతక్కువ స్థాయిలో ఉత్పత్తి శక్తులుండేవి. బానిసలు చనిపోకుండా జీవించి వుండడాని కవసరమైన కనీస వస్తువులు మాత్రమే వారికి లభ్యమయేవి. దోపిడీ చేయబడేవారికి అసలు ఎట్టి హక్కులూ లేకుండా చేయడంద్వారా, "మాట్లాడే పనిముట్లు" స్థాయికి వారిని దిగజార్చడం ద్వారా, అత్యంత క్రూరమైన పద్ధతుల్లో బలప్రయోగం చేయడంద్వారా మాత్రమే ఇది సాధ్యపడింది.

ఉత్పత్తి సంబంధాల్లో వచ్చిన యీ మార్పు ఇతర సామాజిక రంగాల్లో కూడ విప్లవాన్ని తీసుకువచ్చింది.

ఆదిమ కమ్యూన్‌లో ఒండొరుల మధ్యవుండే సహకారం పోయి, సమాజంలో ఒక తరగతి రెండవ తరగతిపై పెత్తనం చెలాయించే సంబంధాలు అమల్లోకి వచ్చాయి అనగా, దోపిడీ సంబంధాలు, శత్రుసంబంధాలు తలెత్తాయి. సమాజం శత్రువర్గాలుగా (బానిస యజమానులు, బానిసలు) చీలిపోయింది.

బానిసయుగం శ్రామిక ప్రజలపై విపరీతమైన భారాలు మోపింది; దారుణమైన కష్టాలు తెచ్చిపెట్టింది[2]. ఎంగెల్సు ఆదిమ కమ్యూనిస్టు వ్యవస్థనుంచి బానిస విధానానికి జరిగిన పరివర్తన దశను ఇలా వర్ణించాడు;

"అతి జుగుప్సాకరమైన వాంఛలు - దురాశ, పశుత్వం, నీచపు కోర్కెలు, స్వార్థబుద్ధితో ఉమ్మడి సంపదను కాజేయడం - యివే నూతన నాగరిక వర్గసమాజాన్ని తీసుకొచ్చాయి; అత్యంత హేయమైన పద్ధతులు -

చౌర్యం, వ్యభిచారం, వంచన, ద్రోహం - పాత వర్గరహిత గణసమాజాన్ని కూలదోసి నాశనం చేశాయి."[4]

ఈ విధంగా, ఎంగెల్స్ ఆదిమ కమ్యూనిజం నుంచి బానిస విధానానికి పరివర్తన దశను వర్ణించాడు.

బానిసలు అమానుషమైన దోపిడీకి గురిచేయబడ్డంవల్ల, వారు అసంతృప్తితో ప్రతిఘటనకు పూనుకున్నారు. దీన్ని అణచేటందుకు ఒక ప్రత్యేక యంత్రాంగం - రాజ్యాంగయంత్రం (State) అవసరమైంది. ఇదివరకటి తెగల పరిపాలనా సంస్థల స్థానే రాజ్యాంగయంత్రం బలప్రయోగానికి సాధనంగా నెలకొల్పబడింది. రాజ్యాంగయంత్రం యొక్క విధులు, బానిసల యజమానుల ఆస్తిని కాపాడ్డం, యుద్ధాల్లో పట్టుబడిన ఖైదీలను బానిసలుగా సప్లయిచేయడం, దివాళాతీసిన ఋణగ్రస్తులను కూడా బానిసలుగాచేసి ఉత్పత్తి కార్యాల్లో నియోగించడమూను. రాజ్యాంగయంత్రం అవతరించటంతో, న్యాయశాస్త్రమూ, పాలకవర్గ అభీష్టాలను వ్యక్తంచేసే న్యాయశాస్త్ర సూత్రాలూ తలెత్తాయి. నూతన ఆచారాలు, బానిస సమాజాని .కనుగుణమైన సిద్ధాంతాలు రూపొందాయి. బానిసలు కానివారు శరీరశ్రమచేయడం అవమానంగా పరిగణింపబడేది; అసహ్యించుకోబడేది. ఈ భావం క్రమంగా బానిస యజమానుల్లో వ్యాపించింది; మానవులు అసమానులనే భావం ఆ విధంగా వేళ్ళూనింది.

ఐనప్పటికీ, బానిసవిధానం మానవ పురోగతిలో ఒక ప్రధానమైన ముందడుగు. దానివల్ల సామాజిక శ్రమవిభజన - వ్యవసాయానికీ పట్టణ వృత్తులకూ మధ్య, వివిధ చేతివృత్తుల మధ్య సంబంధం - మరింత వృద్ధిచెందింది. రెండోవైపు ఈ శ్రమవిభజన స్పెషలైజేషన్‌కీ, మేలురకపు పరికరాల తయారీకీ, నైపుణ్యం వృద్ధిచెందడానికీ దారితీసింది. కాయధాన్యాల ఉత్పత్తితోబాటు, నూతన వ్యవసాయ శాఖలు (కూరగాయల పెంపకం, పండ్లతోటలు వగైరా) ప్రారంభమయాయి. చక్రపునాగలి, గర్రు, గక్కుల కొడవలి వంటి సాధనాలు కనిపెట్టబడ్డాయి. మానవుడు తన కండరాలశక్తినే గాక, జంతువుల శక్తిని కూడా విస్తృతంగా

---

4. కారల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగెల్స్: Selected Works - Moscow, Foreign Languages publishing House, 1958, Vol. II. పుట 225.

ఉపయోగించడం నేర్చుకున్నాడు. అసంఖ్యాకమైన బానిసల శక్తిని ఉపయోగంలో పెట్టడంవల్ల బ్రహ్మాండమైన ఆనకట్టలు, కాల్వలు, రోడ్లు, ఓడలు, రిజర్వాయర్లు, నగరాలు నిర్మింపబడ్డాయి. బానిసలను పీడించి పని చేయించడంద్వారా సమాజంలో కొన్ని తరగతులు స్వయంగా ఉత్పత్తిలో పాల్గొననవసరం లేకపోయింది. ఆవిధంగా విడుదల చేయబడిన శక్తియుక్తులు కళాభివృద్ధికీ, శాస్త్రాభివృద్ధికీ అనుకూల పరిస్థితులను కల్పించాయి.

కాని, కాలక్రమేణా బానిసవిధానంలో ఉత్పత్తి సంబంధాలు క్రమక్రమంగా ఉత్పత్తి శక్తులను ఆటంకపరచే శృంఖలాలుగా తయారుకావడంతో, అభివృద్ధికి గల సహజ అవకాశాలు ఆ సమాజంలో నిండుకున్నాయి. తమ అధీనంలో చౌకగా లభించే బానిసలు అనేకమంది ఉండడంవల్ల బానిస యజమానులు ఉత్పత్తి పరికరాలను మెరుగుపరచడానికి ఎట్టి ప్రయత్నం చేయలేదు. అంతేకాదు, బానిసలు తాము చేసే పనివల్ల లభించే ఫలితంపట్ల ఆసక్తి చూపరు. వారికి క్లిష్టమైన, ఖరీదైన పరికరాలను వొప్పజెప్పడం అసంభవమైన విషయం. ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి తగినట్లు పాత ఉత్పత్తి సంబంధాలను రద్దుచేసి కొత్తవాటిని ప్రవేశపెట్టవలసిన అవసరం అంతకంతకు అధికమయింది.

ఇది సామాజిక విప్లవం ద్వారానే సాధ్యం. బానిసవిధానం వల్ల అందరికంటె హెచ్చుగా బాధపడినవారు, దాన్ని రద్దుచేయటం వల్ల అందరికంటె ఎక్కువగా లాభపడేవారు యీ విప్లవానికి చోదకశక్తులు. ప్రధానంగా వారు బానిసలూ, స్వతంత్రులలో అతి బీదవారూను. పాత ఉత్పత్తి విధానంలోని వైరుధ్యాలు తీవ్రస్థాయికి చేరుకునేసరికి, వర్గ సంఘర్షణ అంతకంతకు నిశితమైంది. అది అనేక రూపాల్లో వ్యక్తమైంది: ఉత్పత్తి సాధనాలను పనికట్టుకుని నాశనంచేయడం లగాయతు లక్షల సంఖ్యలో తిరుగుబాట్లు చేయడం వరకు. చివరకు బానిసల తిరుగుబాట్లు, అనాగరిక తెగల దాడులు కలిసి బానిస విధానాన్ని కూలదోశాయి. ఈ అనాగరిక తెగలు బానిస రాజ్యం (రోమన్ సామ్రాజం) పొరుగున జీవించేవారు. అదివరకే అంతరంగిక వైరుధ్యాలవల్ల, ఘర్షణల వల్ల బలహీనపడిన బానిసరాజ్యం అనాగరిక తెగల దాడులను

ఎదుర్కోలేకపోయింది. ఈ విధంగా బానిస వ్యవస్థ నిర్మూలనమయింది. దాని స్థానంలో మరొక నిర్మాణరూపం - ఫ్యూడలిజం - తలెత్తింది.

## ఫ్యూడల్ వ్యవస్థ

ఫ్యూడల్ వ్యవస్థలో ఉత్పత్తి సాధనాలపై, ముఖ్యంగా భూమిపై, యాజమాన్యం ఫ్యూడల్ భూస్వాములది ("ఫ్యూడలిజం" అనే భావం "ఫియోడమ్" అను లాటిన్ శబ్దంనుంచి వచ్చింది. "ఫియోడమ్" అనగా, రాజుకు సామంత ప్రభువులుచేసే సైనిక సహాయానికి బదులు వారి కతడిచ్చే భూమి.) రైతులు భూస్వాములమీద ఆధారపడి బతుకుతారు. కాని వారు పూర్తిగా భూస్వాముల ఆస్తికాదు.[5] ఫ్యూడల్ భూస్వాములు రైతులచేత వెట్టి చేయించుకోడానికి హక్కు కలిగియుంటారు; రైతులు భూమికి బంధింపబడి, భూస్వామికి పలువిధాలైన వెట్టి చేయాలి. ఫ్యూడల్ వ్యవస్థలో ఉత్పత్తి సంబంధాలకు ప్రాతిపదిక యిదీ.

ఫ్యూడల్ సమాజంలో రైతులు, వృత్తిపనివారు సొంత భూములను కూడా కలిగియుండేవారు. రైతు తన భూమిమీద పండేపంటలో ఫ్యూడల్ భూస్వామికి ఇవ్వవలసినవన్నీ పోను మిగతాది అతని స్వంతం.

ఉత్పత్తి సంబంధాలు ఈ విధంగా ప్రత్యేక స్వభావాన్ని కలిగియుండడంచేత, ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి కొత్త అవకాశా లేర్పడ్డాయి. ఇప్పుడు ఉత్పత్తిదారు తన శ్రమయొక్క ఫలితంలో ఖచ్చితంగా భౌతిక ఆసక్తిని కలిగియున్నాడు. అందుచేత అతడు తన పరికరాలను విరగ్గొట్టడంగాని, పాడుచేయడంకాని చేసేవాడుకాదు. పైగా వాటిని జాగ్రత్తగా చూసుకునేవాడు; తనకు అవసరం లేకపోయినా వాటిని మెరుగుపరచేవాడు. వ్యవసాయం బాగా అభివృద్ధి చెందింది. మూడు చెక్కలసాగు ప్రారంభమైంది. ఎరువులతో భూమిని సారవంతంచేసే పద్ధతులు అంతకంతకు విస్తృతంగా అమల్లోకి వచ్చాయి.

---

5. ఉదాహరణకు రష్యావంటి కొన్ని దేశాల్లో అర్ధబానిస విధానం (Serfdom) మరీ కఠినమైన రూపంలో ఉండేది. బానిస విధానానికి అది దగ్గరలో ఉండేది. భూస్వామి రైతుల్ని కొనుక్కోవచ్చు; అమ్మివేయవచ్చు. ఇలాగే యింకా.

ఇంతకంటె కూడా ప్రధానమైన విజయాలు లభించాయి. చేతివృత్తులవారు- వ్యవసాయ పరికరాలనూ, భూస్వాములకు వర్తకులకు నిత్యజీవితంలో అవసరమైన వస్తువులనూ, రకరకాలైన పాత్రలనూ, ఆయుధాలనూ, తదితర యుద్ధ సామగ్రినీ సప్లయి చేసేవారు. చేతి వృత్తులు, వ్యాపారం అభివృద్ధి చెందడంవల్ల పట్టణాలు తలెత్తాయి. కాలక్రమేణా ఈ పట్టణాలు బలమైన ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక కేంద్రాలుగా తయారయాయి. నూతన పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానానికి అవి ఆటపట్టులయాయి.

ఫ్యూడల్ యుగంలో ఎన్నో ప్రధానమైన పరిశోధనలు జరిగాయి. అనేక కొత్త విషయాలు కనుగొనబడ్డాయి. మానవచరిత్రపై వాటి ప్రభావం చాలా వుంది. మానవుడు వంటఇనుము నుంచి పోతఇనుము వరకు తయారుచేయడం, దూరప్రయాణాలు చేయగల ఓడలకు నౌకాదలములు (Keels) తయారుచేయడం, కండ్లద్దాలు దూరదర్శినులు మొదలైనవి తయారుచేయడం నేర్చుకున్నాడు. దిక్సూచి, తుపాకిమందు, కాగితం, ముద్రణ, గడియారాలు మొదలైనవి కనిపెట్టబడ్డాయి. మనుష్యుల, జంతువుల శారీరకశక్తిని మాత్రమేగాక, వాయుశక్తినికూడా (గాలిమిల్లులు, తెరచాప ఓడలు) అంతకంతకు అధికంగా విస్తృతంగా ఉపయోగించడం నేర్చుకున్నాడు. పై నుంచి కిందికి ప్రవహించే నీటిశక్తికూడ ఉపయోగించుకోగలిగాడు. (మధ్యయుగాలలో నీటిమిల్లులు, నీటిచక్రాలు చాల విస్తృతంగా వ్యాప్తిలో ఉండేవి).

బానిస సంబంధాల స్థానంలో ఫ్యూడల్ సంబంధాలు అభివృద్ధి చెందడంవల్ల మొత్తం సామాజిక జీవితంలోనే గొప్ప మార్పులు వచ్చాయి.

ప్రధానమైన మార్పు వర్గ సంపుటిలో జరిగింది. భూమికి యజమానులైన ఫ్యూడల్ ప్రభువులు పాలకవర్గంగా తయారయ్యారు. ఫ్యూడల్ సమాజంలో రెండవ ప్రధానవర్గం అర్థబానిసలు. ఈ రెండు వర్గాలమధ్య సంబంధాలు శత్రుసంబంధాలు; పరస్పర విరుద్ధమైన, సమన్వయపరచజాలని వర్గప్రయోజనాలపై అవి ఆధారపడి వుండేవి. దోపిడీపద్ధతి బానిస విధానంలో కంటె కొంచెం మెరుగ్గా వున్నప్పటికీ, చాలా క్రూరమైనట్టిది. రైతులదోపిడీ ఆర్థికంగా ' గిట్టుబాటుకాని బలప్రయోగంమీదనే ఇంకా ఆధారపడి వుంది. అర్థబానిస, తన స్వంత

పొలంలో పని చేసుకునేటప్పుడు మాత్రమే అతనికి ఆర్థిక ప్రేరణ, ఉత్సాహం ఉండేవి. తనకున్న వ్యవధిలో అధికభాగం ఫ్యూడల్ భూస్వామికొరకు చేసేపనిలోనే గడచిపోయేది. అందుకు ప్రతిఫలమేమీ ముట్టేదికాదు. ఈ యుగంలో అతడుచేసే పనికి ప్రధాన ప్రేరణ తాను శిక్షింపబడతానన్న భయం, శారీరకంగా హింసింపబడతానన్న భయం, తన సొంత ఆస్తి యావత్తూ భూస్వామిచే జప్తు చేయబడుతుందన్న భయమూను.

ఫ్యూడల్ సమాజంలో వర్గపోరాటం బానిస సమాజంలో కన్న ఉచ్ఛస్థాయికి చేరుకొంది. రైతుల తిరుగుబాట్లు ఒక్కొక్కప్పుడు విస్తృతమైన ప్రాంతాలకు వ్యాపించేవి. ఒకదేశం తర్వాత మరొక దేశంలో విజృంభించిన రైతు యుద్ధాలనుబట్టి రైతులెంత తీవ్రంగా ప్రతిఘటించారో బోధపడుతుంది. ఉదా: ఇంగ్లండులో వాట్ టెయిలర్ తిరుగుబాటు (14 వ శతాబ్దం), ఫ్రాన్సులో జాకరీలు (14, 15 శతాబ్దాలు), జర్మనీలో రైతులయుద్ధం (16 వ శతాబ్దం), చైనాలో తైపింగ్ తిరుగుబాటు (19 వ శతాబ్దం), ఇండియాలో సిక్కుల *తిరుగుబాట్లు (17, 18 శతాబ్దాలు)*[3] రష్యాలో బొలోత్నికోవ్, రజిన్‌ల తిరుగుబాట్లు (17 వ శతాబ్దం), పుగషోవ్ తిరుగుబాటూనూ (18 వ శతాబ్దం). ఇలాగే ఇంకా ఎన్నో తిరుగుబాట్లు జరిగాయి.

ఫ్యూడల్ సమాజంలోని దోపిడీపద్ధతులు, వర్గపోరాట రూపాలు ఆ సమాజంయొక్క రాజకీయ, సిద్ధాంత ఉపరి నిర్మాణంలో ప్రతిబింబించేవి. ఫ్యూడల్ రాజ్యాంగయంత్రం అర్ధబానిసల్ని పీడించి అణచేటందుకు అనవసరంగా సాయుధబలాలను ఉపయోగిస్తూ వచ్చింది. ఈ సాయుధబలాలు కేంద్రాధికారంలోనే కాక, ప్రతి ఫ్యూడల్ ప్రభువువద్దా ఉండేవి. అతడు (ఫ్యూడల్ ప్రభువు) తన ప్రాంతంలో సర్వాధికారి; తన యిష్టం వచ్చిన వ్యక్తిని అతడు శిక్షించవచ్చు.[4]

ఫ్యూడల్ సమాజంలోని ఆర్థిక, సాంఘిక అసమానత ప్రభుత్వచట్టాల్లో వ్యక్తమయేది. సమాజంలోని వర్గాలు, ఒక్కొక్క వర్గంలోని తరగతులు వేర్వేరు ఎస్టేట్లుగా (ప్రభువులు, మతాధిపతులు, వర్తకులు, రైతులు) విభజింపబడేవి. ఒక ఎస్టేటుకూ మరొక ఎస్టేటుకూ మధ్య, ఒకే ఎస్టేటులో వివిధ తరగతుల మధ్య సంబంధాలు కఠినమైన జబర్దస్తీ,

పరాధీనత అన్న రూపాల్లో ఉండేవి. సామాజిక వ్యత్యాసాలు తీవ్ర స్వభావం గలవైనందున సామాజిక అంతస్తుల్లో ఒకదాని నుంచి మరో దానికి మార్పు అసాధ్యమయేది. ఫ్యూడల్ సమాజంలో యావత్తు సాంస్కృతిక జీవితాన్ని మతం, క్రైస్తవపీఠం శాసించేవి.

కాలం గడిచినకొద్దీ, ఉత్పత్తిశక్తుల అభివృద్ధి - ఉత్పత్తి సంబంధాలతోను, వాటిచే నిర్ణయింపబడే రాజకీయ - సిద్ధాంత ఉపరి నిర్మాణంతోనూ ఘర్షణపడింది. రైతులు స్వయంకృషివల్ల తాము ఉత్పత్తిచేసిన దినుసులను యథేచ్ఛగా వినియోగించుకునే హక్కుకోసం; ఫ్యూడల్ వర్గాల దోపిడీకి వ్యతిరేకంగా మరింత తీవ్రమైన పోరాటాలు జరుపుతూ వచ్చారు. వ్యవసాయాన్ని మెరుగుపరచుకునేటందుకు, తదితర సౌకర్యాలకొరకు ఫ్యూడల్‌వర్గాల అక్రమవసూళ్ళను రద్దుచేసుకో యత్నించారు. చిన్న చిన్న వర్క్‌షాపులతోబాటు, చేతివృత్తులమీద ఆధారపడ్డ పెద్దపెద్ద కార్ఖానాలు కూడా తలెత్తాయి. ఇవికూడ వృత్తి శిక్షణమీదనే ఆధారపడినా, శ్రమవిభజనను విస్తృతంగా అమలు జరిపేవి; అర్థబానిసలవలె పరాధీనస్థితిలో లేని స్వతంత్ర కార్మికులచేత పని చేయించుకునేవి.

కొత్తగా తలెత్తిన బూర్జువావర్గానికి కంచుకోటలుగా వున్న పట్టణాలు పటిష్టంగా వృద్ధిచెందాయి. వర్తకం మరింతగా వ్యాప్తి చెందింది. వర్తకులు రాజబలగాల సహాయంతో విదేశాల్లోని కొత్త మార్కెట్లను స్వాధీనం చేసుకున్నారు. రెండోవైపు వర్తకపు సరకుల (commodities) మార్పిడి హెచ్చుడంవల్ల ఉత్పత్తి వేగంగా పెరిగింది. దీనికితోడు 16, 17 శతాబ్దాలలో జరిగిన శాస్త్రీయ, సాంకేతిక పరిశోధనలు ఉత్పత్తి పెరుగుదలకు దోహదమిచ్చాయి.

ఫ్యూడల్ వ్యవస్థలో నుండే పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం క్రమక్రమంగా రూపొందింది. అయితే, అది అభివృద్ధి కావడానికి ఫ్యూడల్ వ్యవస్థ రద్దుకావాలి. నూతన ఉత్పత్తి విధానాన్ని నెలకొల్పిన వర్గంగా ప్రత్యక్షమయిన బూర్జువా వర్గానికి "స్వేచ్ఛాయుత" శ్రామిక మార్కెట్టు (Labour market) అవసరమైంది. అంటే, అర్థబానిసల పరాధీనతనుంచీ సొంత ఆస్తినుంచీ కూడా "స్వేచ్ఛ" పొందిన కార్మికులు అవసరమయారు. ఆకలి బాధచే ఒక ఫ్యాక్టరీ నుంచి మరొక ఫ్యాక్టరీకి పొట్టచేతపట్టుకుని

తిరిగే పనివాళ్ళు కావలసి వచ్చారు. ఫ్యూడల్ భూస్వాములు తమ సంస్థానాలచుట్టూ నిర్మించుకున్న సుంకపు గోడలను, యితర ఆటంకాలను నిర్మూలించాలనీ, జాతీయ మార్కెట్లు ఏర్పడాలనీ యీ వర్గం వాంఛించింది. ఫ్యూడల్ ప్రభువుల దర్బార్ల కోసం, వారి సొంత సిబ్బంది కోసం వసూలుచేసే పన్నులను రద్దుచేయించగలిగింది. ఉన్నత వర్గాల ప్రత్యేకాధికారాలను నిర్మూలింపజేయగలిగింది. దాని లక్ష్యం, సామాజిక జీవితానికి సంబంధించిన అన్ని రంగాలను కంట్రోలు చేయగల శక్తిని సంపాదించడం.

ఫ్యూడల్ వ్యవస్థపట్ల అసంతృప్తిచెందిన అన్ని వర్గాలను, తరగతులను బూర్జువావర్గం సమీకరించింది. గ్రామాలలో అర్ధబానిసలు, పట్టణాల్లో కింది తరగతులకు చెందినవారు - దారిద్ర్యంతో, అవమానాలతో, బాధలతో కుమిలిపోతూ వచ్చారు. అట్టివారే గాక, ఫ్యూడలిజం - క్రైస్తవపీఠాల పెత్తనంకింద నలిగిపోయే పురోగామి చయితలనుండి, శాస్త్రవేత్తలవరకు బూర్జువావర్గం వెనుక నడిచారు.

ఈ విధంగా, బూర్జువా విప్లవాలయుగం ప్రారంభమయింది.

## పెట్టుబడిదారీ వ్యవస్థ

పెట్టుబడిదారీ విధానంలో ఉత్పత్తి సాధనాలపై యాజమాన్యం ప్రైవేట్ పెట్టుబడిదార్లది. ఇదే పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలకు ప్రాతిపదిక. పెట్టుబడిదారీవర్గం కార్మికవర్గాన్ని దోచుకుంటుంది. కార్మికవర్గం వ్యక్తిగతంగా పరాధీనత నుంచి విముక్తిపొందిన వర్గం. అయితే, వారు తప్పనిసరిగా తమ శ్రమశక్తిని అమ్ముకోవాలి. ఎందుచేతంటే, వారు ఉత్పత్తి సాధనాలు లేకుండా చేయబడ్డారు.

పెట్టుబడిదారీ విధానంలో ఉత్పత్తి సంబంధాలు ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి విస్తృత అవకాశాలు కల్పించాయి. యంత్రశక్తితో నడిచే పెద్ద పెద్ద కర్మాగారాల్లో సరకులు ఉత్పత్తి కా నారంభించాయి. మొదట ఆవిరి శక్తి, ఆ తర్వాత విద్యుచ్ఛక్తి వంటి బ్రహ్మాండమైన ప్రకృతిశక్తులు వాటికి ఆధారం. విజ్ఞానశాస్త్రం ఉత్పత్తి కార్యాలకు విస్తృతంగా ఉపయోగించబడుతూ వచ్చింది. ఇట్టి పెద్ద పెద్ద కర్మాగారాలు వేగంగా

అభివృద్ధిచెందాయి. పెట్టుబడిదారీ విధానం ఫలితంగా, శ్రమ విభజన ఒక్కొక్క దేశంలోనే కాక, వివిధ దేశాలమధ్య కూడా అమల్లోకి వచ్చింది. ఆ విధంగా అది ప్రపంచ మార్కెట్టును సృష్టించింది; ఆ తర్వాత ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ రూపొందింది.

ఈసారికూడా, ఉత్పత్తి విధానంలో వచ్చిన మార్పు మొత్తం సామాజిక జీవితంలోనే మార్పులు తీసుకొచ్చింది.

పెట్టుబడిదారీవర్గం, కార్మికవర్గం సమాజంలో ప్రధాన వర్గాలయాయి. ఇదివరకువలెనే వాటిమధ్య సంబంధాలు శత్రుసంబంధాలు. ఎందుచేతంటే, అవి దోపిడీమీద ఆధారపడి వున్నాయి. ఆస్తిలేని వర్గాన్ని ఆస్తిగల వర్గం పీడించే విధానంమీద అవి ఆధారపడి ఉన్నాయి. అత్యంత కఠినమైన వర్గపోరాటంమీద ఆధారపడి ఉన్నాయి. అయితే, దోపిడీ పద్ధతులుమాత్రం, పీడన పద్ధతులు మాత్రం పూర్తిగా మారిపోయాయి. ప్రస్తుతం అమలుజరుగుతున్న దోపిడీపద్ధతి ఆర్థికంగా గిట్టుబాటుపద్ధతి. పెట్టుబడిదారు కార్మికులచేత పనిచేయించుకోడానికి సర్వసాధారణంగా శారీరకహింసను ప్రయోగించ నవసరంలేదు. కార్మికుడు ఉత్పత్తి సాధనాలనుండి వేరుచేయబడినందున అతడు "ఐచ్ఛికంగా"నే పనిచేస్తాడు. లేకపోతే, తిండిలేక చావవలసి వస్తుంది. ఈ విధంగా, దోపిడీ సంబంధాలు "స్వతంత్రంగా" యజమాని కింద పనిచేయడమనే ముసుగుకింద, శ్రమశక్తిని కొనుక్కోడం అమ్ముకోడం అనే ముసుగుకింద మరుగుపరచబడి వుంటాయి.

దోపిడీపద్ధతులు మారడంతో, పరిపాలనా విధానాలుకూడా మారుతాయి. ఇదివరకటి నగ్నమైన క్రూర నిరంకుశ పాలన నుంచి అంతకంటె సొగసైన పాలనకు, బూర్జువా ప్రజాస్వామ్యానికి పరివర్తన జరుగుతుంది. వంశ పారంపర్య హక్కు కలిగి సర్వాధికారాలు అనుభవించే చక్రవర్తుల రాచరికాలస్థానే - పార్లమెంటరీ రిపబ్లిక్ (లేదా, కనీసం చట్టబద్ధ రాచరికం) ప్రవేశపెట్టబడింది. ఓటింగుపద్ధతి ప్రవేశపెట్టబడింది. పౌరులందరికీ కొన్ని రాజకీయ హక్కులుంటాయనీ, చట్టం అందరికీ సమానంగా వర్తిస్తుందనీ ప్రకటింపబడింది. ఈ విధానం స్వేచ్ఛాయుతపోటీ, ఆర్థికశక్తుల స్వేచ్ఛాయుత వర్తన అనే సూత్రాలపై

ఆధారపడింది. ఈ సూత్రాలపై పెట్టుబడిదారీ విధానం చాలాకాలం అధారపడింది.

బూర్జువా సమాజంలోని, ఫ్యూడలిజంలోని రాజకీయ, సిద్ధాంత ఉపరి నిర్మాణాలమధ్య ఎన్ని భేదాలున్నా, ఆ ఉపరి నిర్మాణం సొంత యాజమాన్య సంబంధాల మీదనే, దోపిడీ సంబంధాల మీదనే ఆధారపడి ఉంది. ఈ ప్రధాన విషయం ఏ మాత్రమూ మారదు. ఈ ఉపరి నిర్మాణంలో ప్రధాన భాగం పీడించే వర్గమైన బూర్జువావర్గం యొక్క సంస్థలు, భావాలూను. దీని కర్తవ్యం పెట్టుబడిదారుల పెత్తనాన్ని నిలబెట్టి వుంచడం, పీడిత ప్రజలు లొంగి వుండేటట్లు చూడ్డమూను.

పెట్టుబడిదారీ వ్యవస్థకూడ తాత్కాలికమైనదనే విషయం ఈనాడు సిద్ధాంతరీత్యాను, అనుభవరీత్యాను రుజువవుతోంది. ఈ వ్యవస్థయొక్క గుండెకాయలోనే అంతకంతకు తీవ్రమౌతున్న, సమన్వయ పరచజాలని శత్రువైరుధ్యాలు వృద్ధిచెందాయి. ముఖ్యంగా ఉత్పత్తియొక్క సామాజిక స్వభావానికీ, అనుభవం యొక్క వ్యష్టిస్వభావానికీ మధ్య వైరుధ్యం పరిణతిచెంది వృద్ధిచెందింది. ఈ వైరుధ్యాలనుంచి బయటపడేందుకు ఒకే ఒక మార్గం ఉత్పత్తి సాధనాలను సామాజిక యాజమాన్యం కిందికి తేవడం. అనగా సోషలిస్టు సమాజాన్ని నిర్మించడం.

కాని, ఇదివరలో వలెనే ఇప్పుడుకూడ, నూతన ఉత్పత్తి విధానానికి మార్పు సామాజిక విప్లవం ద్వారానే సాధ్యం. ఈ విప్లవాన్ని తీసుకురాగలిగిన శక్తి కార్మికవర్గం. ఈ వర్గం పెట్టుబడిదారీ - వ్యవస్థలో ఉత్పన్నమయింది. కార్మికవర్గం శ్రామికప్రజ లందర్నీ తనవైపు సమీకరించుకుని, పెట్టుబడిదారుల పెత్తనాన్ని కూలదోస్తుంది. దాని స్థానంలో నూతన సోషలిస్టు వ్యవస్థను సృష్టిస్తుంది. ఆ వ్యవస్థలో, ఒక మనిషిని మరొక మనిషి దోచుకొనేపద్ధతి ఉండదు.

## సోషలిస్టు వ్యవస్థ

సోషలిస్టు ఉత్పత్తి విధానం ఉత్పత్తి సాధనాలపై సామాజిక యాజమాన్యం అనే సూత్రంమీద ఆధారపడి వుంటుంది. అందుచేత సోషలిస్టు సమాజంలో ఉత్పత్తి సంబంధాలు దోపిడీనుంచి విముక్తిచెందిన కార్మికుల మధ్య సహకారం, అన్యోన్య సహాయం అనే రూపంలో

వుంటాయి. అవి ఉత్పత్తిశక్తుల స్వభావానికి అనుగుణమైనవి. ఉత్పత్తి సాధనాలపై సామాజిక యాజమాన్యం అనే సూత్రం మీద- ఉత్పత్తి యొక్క సామాజిక స్వభావం ఆధారపడి వుంటుంది.

ఆదిమ కమ్యూనిస్టు వ్యవస్థలోవలె కాకుండా, ఇప్పుడు సమాజపరం చేయబడే ఉత్పత్తిసాధనాలు బ్రహ్మాండంగా అభివృద్ధి చెందిన ఉత్పత్తి శక్తులపైన, సంస్కృతిపైన, ప్రకృతిమీద మానవుని ఆధిపత్యం పైన ఆధారపడి వుంటాయి. ఈ నూతన వ్యవస్థ ఉత్పత్తిశక్తుల్ని అభివృద్ధి చేయడంలోనే కాక, సామాజిక జీవితానికి సంబంధించిన మిగతా రంగాలన్నిటినీ అభివృద్ధిచేయడంలో మానవజాతికి అనంతమైన అవకాశాలను సమకూరుస్తుంది.

❀ ❀ ❀

మానవ సమాజం అభివృద్ధిచెందిన ప్రధాన దశలను చాల క్లుప్తంగా పైన వివరించాం.

గతాన్ని గురించి మనకున్న పరిజ్ఞానాన్నిబట్టి, చరిత్రను గురించిన భౌతికవాద దృక్పథం శాస్త్రీయంగా సరియైనదని చెప్పడానికి స్పష్టమైన రుజువులున్నాయి. మార్క్సు తన "అర్థశాస్త్ర విమర్శన" (Contribution to the Critique of Political Economy) అనే పుస్తకానికి ప్రవేశిక రాస్తూ, దాని సారాంశాన్ని ఇలా వివరించాడు:

"మనుష్యులు సామాజికంగా తమ జీవితావసరాలను ఉత్పత్తి చేసుకోవడంలో కొన్ని నిర్దిష్టమైన, అవసరమైన సంబంధా లేర్పరచుకుంటారు. వాటికీ, వారి అభీష్టాలకూ ఎట్టి సంబంధం వుండదు. ఉత్పత్తి సంబంధా లంటే అవే. ఉత్పత్తిశక్తుల అభివృద్ధిని తెలియజేసే ఒక దశకు అనుగుణంగా ఈ ఉత్పత్తిసంబంధా లుంటాయి. ఉత్పత్తి సంబంధాలన్నీ కలిసి సమాజంయొక్క ఆర్థికవ్యవస్థ అవుతుంది. అదే సమాజాని కంతకూ నిజమైన పునాది. దాని ఆధారంమీదనే న్యాయ రాజ్యాంగ ఉపరి నిర్మాణం ఏర్పడుతుంది. సామాజిక చైతన్యం (Social Consciousness) కూడా దాని కనుగుణంగానే రూపొందుతుంది. భౌతిక జీవితావసరాల ఉత్పత్తి మొత్తం సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక వ్యాపారాలను శాసిస్తుంది. మానవుల జీవితాన్ని నిర్ణయించేది వారి

చైతన్యం కాదు; పైగా వారి సాంఘిక జీవితమే వారి చైతన్యాన్ని నిర్ణయిస్తుంది. సమాజంయొక్క భౌతిక ఉత్పత్తిశక్తులు నిరంతరం అభివృద్ధి చెందుతూ, ఒకానొక దశ వచ్చేటప్పటికి ఏ ఉత్పత్తి సంబంధాల్లో అవి అభివృద్ధి చెందుతూ వచ్చాయో ఆ ఉత్పత్తి సంబంధాల్ని - న్యాయశాస్త్ర పరిభాషలో చెప్పాలంటే ఆస్తి సంబంధాల్ని - ఢీకొంటాయి. ఉత్పత్తిశక్తులు అభివృద్ధి చెందటానికి ఏవైతే సాధనాలుగా ఉంటూవచ్చాయో ఆ ఉత్పత్తి సంబంధాలే సంకెళ్లుగా తయారవుతాయి. అప్పుడు సామాజిక విప్లవశకం ఆరంభమౌతుంది. ఆర్థిక పునాది మారడంతో, మొత్తం ఉపరినిర్మాణం ఎంతో కొంత వేగంగా మారుతుంది."[6]

## 5. చారిత్రక నియమాలు, మానవుని చైతన్యయుత వ్యాపారం

సామాజికాభివృద్ధి కొన్ని నియమాల ననుసరించి జరుగుతుంది. అదొక పరిణామక్రమం. ఒకానొక చారిత్రక అవశ్యకతకు అది లోబడి ఉంటుంది. ఈ అవశ్యకత మనుష్యుల అభీష్టాలమీద, చైతన్యంమీద ఆధారపడి వుండదు. సమాజం శ్రేయస్సుకై భౌతిక నియమాలను వర్తింపజేయడాని కవసరమైన సామాజికశాస్త్రాల అత్యంత ప్రధానమైన లక్ష్యం, ఈ అవశ్యకతయొక్క స్వభావాన్ని కనిపెట్టడం, చారిత్రక పరిణామాన్ని నిర్ణయించే నియమాలను తెలుసుకోవడం, అవెలా అమలు జరుగుతాయో అర్థం చేసుకోవడమూను.

### సామాజిక నియమాలు అమలు జరిగే విధానం

చరిత్ర అనగా కొన్ని నియమాల ననుసరించి అభివృద్ధిచెందే పరిణామక్రమం. ఇదే మార్క్సిస్టు సిద్ధాంతం. ఇది స్వీయాత్మక ధోరణులకు, అదృష్టశక్తుల సిద్ధాంతానికి కూడా వ్యతిరేకం. చరిత్ర అనేక యాదృచ్ఛిక ఘటనల సముదాయమని స్వీయాత్మక ధోరణి చెబుతుంది. అదృష్టశక్తుల సిద్ధాంతం ప్రజల చైతన్యయుత కార్యాల ప్రాధాన్యతనూ, సామాజికాభివృద్ధిని రూపొందించగల శక్తినీ నిరాకరిస్తుంది.

---

6. కారల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగెల్స్: Selected Works, Moscow, Foreign Languages Publishing House, 1958, Vol. I, పుట 362-63.

అదృష్టశక్తుల సిద్ధాంతం చరిత్రను గురించిన భౌతికవాద దృక్పథానికి పూర్తిగా భిన్నమైనట్టిది. ఏ నియమాల ననుసరించి సమాజం అభివృద్ధి చెందుతుందో, ఆ నియమాలు వాటంతట అవి అమలు జరగవు. మనుష్యుల కార్యకలాపాల ఫలితంగా ఏర్పడే ఈ నియమాలు తిరిగి మనుష్యుల కార్యకలాపాలను ఒక సాధారణ దిశలో నడుపుతాయి.

చారిత్రక అవశ్యకతను గురించిన ఈ దృక్పథం మార్క్సిస్టులను అవకాశవాదుల నుంచి వేరుచేస్తుంది. ఉదాహరణకు, అవకాశవాదులు సోషలిజం కొన్ని నియమాల ననుసరించి తప్పక విజయం సాధిస్తుందనే సక్రమ సూత్రీకరణ నుంచి పూర్తిగా తప్పునిర్ధారణకు వస్తారు. పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా పోరాడనవసరంలేదనీ, "చారిత్రక నియమాలు" తమంతటతాము పెట్టుబడిదారీ విధానాన్ని కూలదోసి సోషలిజాన్ని నిర్మించే సమయంకోసం నిరీక్షిస్తూ కూర్చుంటే సరిపోతుందనీ అభిప్రాయపడతాడు.

నిజానికి చారిత్రక నియమాలు.వాటంతట అవి, ప్రజలు లేకుండా, చరిత్రను నిర్మించవు. లక్షలాది ప్రజలు చేసే పనులద్వారా, పోరాటల ద్వారా, చైతన్యయుతమైన కృషిద్వారా మాత్రమే అవి చారిత్రక గమనాన్ని నిర్ణయిస్తాయి.

మార్క్సిజాన్ని ఖండించే బూర్జువా విమర్శకులు మార్క్సిజంలో స్వవచన వ్యాఘాతం వుందని నిందిస్తారు. ఒకవైపు మార్క్సిస్టులు తప్పనిసరిగా పెట్టుబడిదారీ విధానంస్థానే సోషలిజం వస్తుందని చెపుతూ, రెండోవైపు సోషలిజం కోసం పోరాడేటందుకు ఒక రాజకీయపార్టీని నిర్మిస్తారని హేళన చేస్తారు. సూర్యగ్రహణం తప్పకుండా వస్తుందని తెలిసివున్నట్లయితే, అందుకోసం ఒక రాజకీయ పార్టీని నిర్మించాలని ఎవరూ అనుకోరుగదా - అని వారంటారు.

బూర్జువా "విమర్శకులు" ఈ సమస్యను లోతుగా పరిశీలించరని ఈ వాదననుబట్టి తెలుసుకోవచ్చు. మార్క్సిస్టు సిద్ధాంతాన్నిగాని, చారిత్రక గమనాన్ని గాని అర్థంచేసుకునే శక్తి, అట్టికోరిక వారికి లేనట్లు స్పష్టమవుతుంది. సూర్యగ్రహణం మనుష్యుల ప్రమేయం లేకుండానే జరుగుతుంది. కాని పెట్టుబడిదారీ విధానం నుంచి సోషలిజానికి పరివర్తన

అలాంటిదికాదు. సామాజిక వ్యవస్థలో అదొకమార్పు. ప్రజల కార్యకలాపాల ఫలితంగా అది జరుగుతుంది. అంతేగాని, ఆ మార్పు దానంతట అది జరగదు. సమాజం కొన్ని నియమాల ననుసరించి సోషలిజానికి పురోగమించే క్రమంలో చైతన్యయుతమైన మానవ వ్యాపారం కూడ ఒక నిశ్చితమైన భాగమే. భౌతికనియమాలు ఉత్తరోత్తరా తప్పక అమలుజరుగుతాయని చెబుతున్నామంటే అర్థం, సమాజంలో కొన్ని అవసరమైన మార్పులు వాటంతట అవి జరుగుతాయనికాదు; త్వరగాగాని ఆలస్యంగాగాని ఈ నియమాలు అమలుజరగాలని కోరే శక్తులు ఉత్పన్నమౌతాయనీ, అవి పోరాటంద్వారా ఆ నియమాలను అమల్లోకి తీసుకొస్తాయనీ మన భావం.

మార్క్సిజం - లెనినిజం సామాజిక నియమాలను గతితార్కిక దృష్టితో చూస్తుంది. కొన్ని నిర్దిష్టమైన సామాజిక సంబంధాల్లో సామాజిక నియమాలు ప్రధాన ధోరణిగా రూపొంది, అమలు జరుగుతాయి. దీని అర్థమేమంటే, కొన్ని భౌతిక పరిస్థితుల నుంచి అవశ్యంగా ఉత్పన్నమయే పరిణామక్రమం యొక్క సాధారణ దిశను ఆ నియమం నిర్ణయిస్తుంది. ఐతే, సామాజికాభివృద్ధి వైరుధ్యాలతో కూడుకుని వుంటుంది. అందుచేత, ఘటనల నిర్దిష్ట గమనం సాధారణ నియమాలమీదనే కాక, వర్గ శక్తుల వాస్తవ సంబంధాలమీద, పోరాటంలో అవి అనుసరించే విధానాలమీద, యింకా అనేక పరిస్థితులమీద ఆధారపడి వుంటుంది. పెట్టుబడిదారీ విధానంస్థానే సోషలిజం అనివార్యంగా నెలకొంటుందని మార్క్సిస్టులు చెబుతున్నారంటే అర్థం, వారి దృష్టిలో యీ కింది విషయా లుండి తీరుతాయి: పెట్టుబడిదారీ సమాజం యొక్క భౌతిక నియమాలు అనివార్యంగా ఆర్థిక, రాజకీయ వైరుధ్యాలను తీవ్రమొనర్చుతాయి; తత్ఫలితంగా కార్మికవర్గం, తదితర శ్రామిక ప్రజలు పెట్టుబడిదారి విధానానికి వ్యతిరేకంగా అంతకంతకు తీవ్రమైన పోరాటాలు సాగిస్తారు. ఆ పోరాటాలు పెట్టుబడిదారీ విధానం కూలిపోయి సోషలిజం ఏర్పడ్డానికి దారితీస్తాయి. కార్మికవర్గం జరిపేపోరాటం ఒక చారిత్రక అవశ్యకతను తెలియజేస్తుంది. కాని, ఒకానొక సమయంలో దాని విజయం అనేక పరిస్థితులమీద ఆధారపడి వుంటుంది. అంటే, కార్మికుల్లో వుండే వర్గచైతన్యం యొక్క స్థాయి, వారి నిర్మాణపటిమ, మార్క్సిస్టు పార్టీల

పలుకుబడి అవి అనుసరించే విధానం, బూర్జువా రాజ్యాంగ యంత్రం యొక్క పంథా మొదలయిన వాటిమీద ఆధారపడి యుంటుంది. వీటిలో కొన్ని కార్మికవర్గ పోరాటం అంతిమ విజయం సాధించడాన్ని త్వరిత మొనర్చవచ్చు; మరి కొన్ని ఆలస్యం అయేటట్లు చేయవచ్చు. ఏది ఎలా వున్నా, అంత్య పరిశీలనలో కార్మికవర్గం విజయాన్ని సాధించడం, సోషలిజం స్థాపింపబడ్డం అనివార్యం. అందుచేత కమ్యూనిస్టులూ, వారి మిత్రులూ కార్మికవర్గ విముక్తికోసం, కష్టజీవులందరి విముక్తి కోసం జరిగే పోరాటాన్ని అభివృద్ధి చేయదంవల్ల, వారి రాజకీయ చైతన్యాన్నీ నిర్మాణ బలాన్నీ పెంపొందించడం వల్ల చరిత్ర యొక్క సహజ గమనాన్ని త్వరిత మొనర్చినవారవుతారు; నూతన సమాజంయొక్క "ప్రసవవేదన"ను తగ్గించిన వారవుతారు.

ఈ విధంగా మార్క్సిస్టు సిద్ధాంతం చారిత్రక గమనంయొక్క ఆవశ్యకతను, నియమబద్ధతను గుర్తించడంతోబాటు, ప్రజలూ అభ్యుదయవర్గాలూ స్వయంగా పోరాడాలనీ, ఆ పోరాటమే నిర్ణయాత్మక పాత్ర వహిస్తుందనీ మార్క్సిస్టు సిద్ధాంతం చెబుతుంది. లెనిన్ యీ విధంగా రాశాడు:

"మార్క్సిజానికీ, యితర సోషలిస్టు సిద్ధాంతాలకూ గల తేడా ఏమంటే, భౌతిక పరిస్థితులనూ పరిణామక్రమాన్నీ విశ్లేషించడంలో మార్క్సిజం పూర్తిగా శాస్త్రీయమైన, నిదానమైన దృష్టిని కలిగియుండడంతోబాటు, ప్రజల విప్లవ పటుత్వం, సృజనాత్మకశక్తి, విప్లవచొరవ ఎంత ప్రాధాన్యం వహిస్తాయోకూడా అతి ఖచ్చితంగా గుర్తిస్తుంది. ప్రజలే కాదు - వివిధ వర్గాలతోగల సంబంధాలను కనుగొనగల, ఏర్పరచుకోగల వ్యక్తుల, గ్రూపుల, సంస్థల, పార్టీల విప్లవపటుత్వం, సృజనాత్మకశక్తి, విప్లవచొరవ ఎంత ప్రాధాన్యం వహిస్తాయో అది గుర్తిస్తుంది."[7]

---

7 లెనిన్ వర్క్సు, 13వ సంపుటి. పుట 21-22 (Marx-Engels Marxism, Moscow, 1953, P 262

# సామాజికాభివృద్ధిలో భావాల పాత్ర

చారిత్రక నియమాలు మనుష్యుల చైతన్యయుత కార్యాల్లో వ్యక్తమవుతాయన్న విషయాన్ని గుర్తించడమంటే అర్థం, సామాజిక భావాలెంత గొప్ప పాత్ర వహిస్తాయో తెలుసుకోవడమన్నమాట.

చారిత్రక భౌతికవాదం చరిత్రలో భావాలకు గల పాత్రను తక్కువ అంచనా వేయడమో, పూర్తిగా నిరాకరించడమో చేస్తుందని మార్క్సిజాన్ని ఖండించే బూర్జువా విమర్శకులు వాదిస్తారు. ఈ విషయాన్ని నిరూపించేటందుకు వారు, సమాజంయొక్క సాంస్కృతిక జీవితమంతా భౌతిక పరిణామాల ప్రతిబింబమేనని మార్క్సిస్టులు భావిస్తారంటారు. కాని, సామాజిక భావాలకు మూలమేమిటో తెలియజేయడమంటే, వాటి ప్రాధాన్యాన్ని తగ్గించి చెప్పడమూ కాదు; నిరాకరించడమూ కాదు. మార్క్సిజం ఎన్నటికీ భావాల, సామాజిక లక్ష్యాల, మానవ సంవేదనల, ఆశయాల - స్థూలంగా మానవుని ఆంతరికోద్దేశాల - ప్రాధాన్యతను తిరస్కరించదు. కమ్యూనిస్టులు ఒకవైపు శ్రామిక ప్రజలకు శాస్త్రీయమైన కమ్యూనిస్టు సిద్ధాంతాన్నీ, వర్గసమైక్యతా భావాన్నీ, అంతర్జాతీయతనూ బోధిస్తూ, రెండోవైపు స్వీయాత్మక విషయానికి, అంటే చరిత్రలో మానవుల చైతన్యయుత కార్యాలకు ప్రాధాన్యత యివ్వకపోతే, తాము చెప్పినదాన్ని తామే తిరస్కరించినవారవుతారు.

ప్రజల మనోభావాలు, సంవేదనలు చారిత్రక ఘటనలకు అంతిమ కారణాలు కావనీ, యీ మనోభావాలే, సంవేదనలే ప్రజల భౌతిక జీవితం నుంచి ఉత్పన్న మవుతాయనీ మాత్రమే మార్క్సిజం చెబుతుంది. కాని, అదే సమయంలో, భౌతికజీవితం యొక్క స్థితిగతులు ప్రజల చైతన్యంలో ప్రవేశించి, కొన్ని ఖచ్చితమైన అభిప్రాయల రూపంలో, ఆశయాల రూపంలో, ఉద్దేశాలు మొదలైనవాటి రూపంలో ప్రతిబింబించడం ద్వారానే, ప్రజల్ని కార్యోన్ముఖులను చేస్తాయని నొక్కి చెబుతుంది.

వివిధ దేశాల్లో సామాజిక భావాల చరిత్రను పరిశీలిస్తే మనకు బోధపడే విషయ మేమంటే, కొన్ని విశిష్టమైన భావాల పుట్టుక భౌతిక జీవితాభివృద్ధియొక్క అవసరాలతో దగ్గర సంబంధం కలిగియుంటుంది. భౌతిక జీవితాభివృద్ధి ప్రజలముందు కొన్ని నూతన కర్తవ్యాలను

ఉంచినప్పుడల్లా సామాజిక వ్యవస్థలో మార్పుయొక్క అవసరాన్ని వ్యక్తంచేసే భావాలు కూడా ఉత్పన్నమవుతూ, వ్యాప్తిచెందుతూ ఉంటాయి. ఈ కర్తవ్యాలను ప్రజలు ఏదో ఒక రూపంలో అర్థం చేసుకుంటారు; తదనుగుణమైన భావాల్లో అవి వ్యక్తమవుతూ ఉంటాయి. అందుచేత, సామాజిక వ్యవస్థలో మార్పుయొక్క అవసరాన్ని వ్యక్తంచేసే నూతన భావాలు, విప్లవభావాలు యాదృచ్ఛికంగా ఉత్పన్నం కావు. సమాజంయొక్క భౌతిక జీవితంలో వచ్చే మార్పులకవి సహజ ప్రతిబింబాలు. ఉదాహరణకు, పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలకూ నూతన ఉత్పత్తి శక్తులకూ మధ్య జరిగే ఘర్షణ మనుష్యుల ఆలోచనల్లో ప్రతిబింబిస్తుందనీ, ఆ ఘర్షణవల్ల ప్రత్యక్షంగా బాధపడే కార్మికుల మనస్సుల్లో ప్రతిబింబిస్తుందనీ, ఆ ప్రతిబింబమే శాస్త్రీయ సోషలిజం అనీ ఎంగెల్స్ తెలియజేశాడు.

సమాజంయొక్క కొన్ని భౌతికావసరాలు పరిణతి చెందడంవల్ల ఉత్పన్నమయే యీ భావాలు, రెండోవైపు సామాజికాభివృద్ధి క్రమంపై కూడా ప్రభావం కలుగజేస్తాయి. ఇదెలా జరుగుతుంది?

భావాలు వాటంతట అవి ప్రత్యక్షంగా సమాజం యొక్క భౌతిక జీవితంపై ప్రభావం కలిగించలేవనేమాట స్పష్టం. అవి ప్రజల మనస్సుల్లో పుట్టి, ప్రజల మనస్సుల్లో పెరుగుతాయి. అందుచేత, అవి కొన్ని నిర్దిష్టమైన కార్యాల్లో, ప్రజల ప్రవర్తనలో వ్యక్తమైనప్పుడే, సామాజికాభివృద్ధిపై వాటి ప్రభావం కనిపిస్తుంది. భావాలు సామాజిక అవసరాల కనుగుణంగా ఉన్నప్పుడు, అవి త్వరగానో ఆలస్యంగానో విస్తృత ప్రజాసామాన్యం యొక్క చైతన్యాన్ని అందుకుంటాయి; వారి భావాలుగా అవి అవుతాయి; ప్రజల్ని ఒక బలీయమైన సైన్యంగా, ఒకే ఒక లక్ష్యంతో, మనోనిశ్చయంతో ఉత్తేజితులయిన మహా సైన్యంగా సంఘటిత పరుస్తాయి. ప్రజల్లో, దానంతట అది ఉత్పన్నమయే అసంతృప్తినీ, ఆవేశాన్నీ సంఘటిత పోరాటంగా మారుస్తాయి. అప్పుడు భావాలు కేవల భావాలుగానే వుండక, ఒక ఆదర్శంగా రూపు ధరిస్తాయి. ప్రజల్ని అవి ఐక్యపరచి, సంఘటిత పరుస్తాయి. కొన్ని నిర్దిష్టమైన కార్యాలకు ప్రజల్ని పురిగొల్పుతాయి. అందువల్లనే, భావాలు ప్రజల్ని ఆకట్టుకున్నప్పుడు అవి ఒక భౌతిక శక్తిగా అవుతాయని మార్క్స్ చెప్పాడు.

ఒకానొక సమాజంయొక్క చైతన్యం క్లిష్టమైనట్టిది; వైరుధ్యాలతో కూడినట్టిది. సామాజికస్థితి ఏకశిలా ఖండం కాదు. అందులో అభ్యుదయకరమైన విప్లవకరమైన ధోరణులూ, అభివృద్ధి నిరోధకమైనవీ కూడా వుంటాయి. అవికూడ సామాజిక చైతన్యంలో ప్రతిబింబిస్తాయి. ఒకవైపు, శిథిలమౌతున్న వర్గాల ప్రయోజనాలను, కాలం తీరిన సామాజిక పరిస్థితులను వ్యక్తంచేసే పాత అభివృద్ధి నిరోధక భావాలు అందులో వుంటాయి. ఉదాహరణకు, సమకాలీన బూర్జువా సిద్ధాంతాలు శిథిలమౌతూన్న పెట్టుబడిదారీ వ్యవస్థను వృద్ధిచేయాలని చూస్తున్నాయి. రెండోవైపు, అభ్యుదయకరమైన విప్లవవర్గాల సిద్ధాంతాల్లో తలెత్తి అంతకంతకు పలుకుబడి సంపాదించే భావాలూ ఉంటాయి. ఈ సిద్ధాంతాలు సామాజిక జీవితంయొక్క నూతన అవసరాలను ప్రతిబింబిస్తూ, ప్రజల్ని అభ్యుదయమార్గంలో నడిచేటట్లు ప్రోత్సహిస్తాయి.

పాలకవర్గం అభివృద్ధి నిరోధక వర్గంగా తయారయిన తరువాత కూడా చాలాకాలంవరకు దాని సిద్ధాంతసంపుటి ప్రబలంగానే వుంటుంది. మొదటి విషయమేమంటే, అది అలవాట్లపైన, సంప్రదాయంపైన ఆధారపడి వుంటుంది. రెండవ విషయమేమంటే, దాన్ని పాలకయంత్రమంతా (ముఖ్యంగా రాజ్యాంగ యంత్రం), పాలకవర్గం యొక్క సంస్థలన్నీ (మతం, పత్రికలు, వగైరా) బలవంతంగా ప్రజలపై రుద్దుతాయి. ఆ విధంగా కొత్తభావాల వ్యాప్తిని అవి అరికడతాయి. కాని నూతన సిద్ధాంతం సామాజికాభివృద్ధి యొక్క అవసరాల్ని ప్రతిబింబిస్తుందిగనుక అదే మిన్న అవుతుంది. విప్లవ భావాలను నిషేధించవచ్చుగాని, వాటి నెవరూ నిర్మూలించలేరు. త్వరగానో ఆలస్యంగానో అవి ప్రజలను ఆకట్టుకుంటాయి; ఆచరణకు పురిగొల్పుతాయి; అప్పుడు పాత వ్యవస్థ కూలిపోతుంది. ఈ విధంగా సామాజిక భావాలు చారిత్రకాభివృద్ధియొక్క సహజక్రమంలో ఒకదానితో ఒకటి అల్లుకుపోయి వుంటాయి.

చరిత్రలో భావాలు ఇంత ప్రధానమైన పాత్ర వహిస్తూండడంచేత, సమాజాన్ని విప్లవాత్మకంగా మార్చడానికి జరిగేపోరాటంలో వాటి ప్రాధాన్యత చాలా వుంటుంది. లెనిన్ రష్యాలో మార్క్సిస్టు పార్టీని స్థాపించేటందుకు తొలి చర్యగా "ఇస్క్రా" పత్రికను ప్రారంభించాడంటే,

ఊరకచేసిన పనికాదు. ఆ పత్రికద్వారా కార్మికుల్లో మార్క్సిస్టు విప్లవభావాలు వ్యాప్తిచేయబడ్డాయి. అప్పుడు ఒక భౌతిక నిర్మాణంద్వారా, రాజకీయపార్టీద్వారా సిద్ధాంత ఐక్యత పటిష్టం చేయబడింది. అభ్యుదయ భావాలు పురోగామి వర్గాల మనస్సుల్ని ఆకట్టుకునేవరకూ భౌతిక జీవిత పురోగతి సమాజం ముందుంచే కర్తవ్యాలు నిర్వర్తింపబడవు. విప్లవ చైతన్యం ఎంత ఉన్నత స్థాయిలో వుంటే, అంత విస్తృతంగా విప్లవభావాలు ప్రజల్లో వ్యాపిస్తాయి. అంత సులభంగాను, త్వరితంగాను సమాజాన్నెదుర్కొనే సమస్యలు పరిష్కారమౌతాయి.

## సామాజికాభివృద్ధిలో యాదృచ్ఛికత, చైతన్యం

సోషలిజానికి ముందు అభివృద్ధిచెందిన సామాజికరూపాలన్నీ ఎలా నెలకొన్నాయంటే, భౌతిక నియమాలు వాటంతట అవి అమలు జరిగాయి. వ్యక్తుల యాదృచ్ఛిక, అస్తవ్యస్త చర్యలద్వారా అవశ్యకత తనకు తోచిన మార్గం తాను తొక్కుతూ ముందుకుసాగింది. ఈ భౌతిక నియమాలు ప్రజల్ని శాసిస్తూ వచ్చాయి. ప్రజలు వాటిని తమ కర్థంకాని పరాయి శక్తులుగా పరిగణించారు. విధిలేక వాటికి తలవంచారు.

దీనికి కారణం, ప్రజలకు ఈ సామాజిక నియమాలను గురించి తెలియకపోవడ మొక్కటేకాదు. సామాజికాభివృద్ధి దానంతట అది జరగడానికి ప్రధానకారణం సమాజంలో భౌతిక ఉత్పత్తి అనే కీలకరంగం సమాజంయొక్క అదుపు ఆజ్ఞల్లో లేకపోవడం. ఉత్పత్తి సాధనాలు వ్యక్తుల యాజమాన్యం కింద వుండడంచేత, మానవుడు చైతన్యయుతంగా మొత్తం సామాజికాభివృద్ధిని నడపలేదు. ప్రతివ్యక్తీ తన వ్యాపారంలో, తన కార్ఖానాలో, తన పొలంలో తన అభీష్టం ప్రకారం పనిచేస్తాడు; లాభనష్టాలకు తానే బాధ్యుడవుతాడు; కాని మొత్తం సమాజంయొక్క అభివృద్ధి మాత్రం దానంతట అది జరిగిపోతుంది; ప్రజల చైతన్యయుత కంట్రోలు ఉండదు. సమాజం శత్రువర్గాలుగా విభజింపబడ్డంవల్ల ఉమ్మడి లక్ష్యం దానికుండదు; భౌతిక నియమాల ననుసరించి సమాజాన్ని వృద్ధిచేసేటందుకు సమష్టి ఆశయం ఉండదు.

ఈ విధంగా, అంధ సామాజికశక్తుల ఆధిపత్యం కింద లొంగి పడి ఉండడం చాలామంది ప్రజలమీద పెద్ద ప్రభావం కలిగించింది.

మనుష్యుల, జాతుల జీవన్మరణాలు అదృష్టకర్మచే శాసింపబడుతున్నాయనే అంధ విశ్వాసాలు ఇలా ఉత్పన్నమైనవే. మతాన్ని గురించిన మొత్తం భావమే ఇలాంటిది.

కాని, దోపిడీ సమాజంలో సహితం కొన్ని సందర్భాలలో మనుష్యుల చైతన్యయుత కార్యాలు పెద్ద పాత్ర వహిస్తాయి. ముఖ్యంగా, సామాజిక విప్లవాలు జరిగే సమయాల్లో ఇలా సంభవిస్తుంది. అలాంటి సమయాల్లో విప్లవవర్గానికి, లేదా కనీసం దీని అగ్రగామి దళానికి తన ప్రధాన చారిత్రక కర్తవ్యా లేమిటో చాలా స్థూలంగా అయినా ఒక ఖచ్చితమైన, చైతన్యయుత దృక్పథం వుంటుంది. 18 వ శతాబ్దంలో విప్లవవర్గమైన ఫ్రెంచి బూర్జువా వర్గ సిద్ధాంతవేత్తలు ఫ్యూడలిజం స్థానే పెట్టుబడిదారీ విధానం ఏర్పడి తీరుతుందని విశ్వసించారు. అందుకు వారు ఆర్థిక నియమాల అర్థాన్ని పూర్తిగా తెలుసుకోలేదు. అయినప్పటికీ, ఆ నియమాలనుండి ఉత్పన్నమయిన క్రియాత్మక కోర్కెలను ఇంచుమించు సరిగానే వారు రూపొందించారు. (రైతుల వ్యక్తిగత పరాధీనతను రద్దుచేయడం, శ్రేణుల నిబంధనలను నిర్మూలించడం, ఫ్యూడల్ భూస్వాముల ప్రత్యేకాధికారాలను తొలగించడం వగైరా). ఎందుచేతంటే, ఫ్రెంచి బూర్జువావర్గం ఈ చర్యలను గాఢంగా వాంఛించింది. కాని ఇక్కడ కూడ సరియైన నినాదాలు రకరకాలైన భ్రాంతులతో కలిసిపోయాయి. ఫ్రెంచి విప్లవోద్యమ ప్రవక్తలు తాము నిష్కల్మషంగా కోరిన "న్యాయ పరిపాలన" స్థానే నిర్దాక్షిణ్యమైన ధనస్వామ్య పెత్తనం వచ్చినందుకు బహుశా ఆశ్చర్యపడివుంటారు; వారి భ్రాంతులుకూడ తొలగిపోయి వుంటాయి.

చరిత్రలో సమస్త భ్రాంతుల నుంచి విముక్తిచెందిన మొట్టమొదటి వర్గం శ్రామికవర్గం. దానికి ఆత్మవంచన అవసరం లేదు. ఎందుచేతంటే, భౌతిక చారిత్రకగతి తన ప్రయోజనాలకు, లక్ష్యాలకు భిన్నంగా లేదు; ఇక ముందుకూడా ఉండదు. పైగా అవి సిద్ధించేటందుకే అది దారి తీస్తుంది. ఎందుచేతంటే, సామాజికాభివృద్ధియొక్క అవసరాలను అవగాహన చేసుకోవడం వల్లనే, కార్మికవర్గం తన లక్ష్యాలను రూపొందించుకుంటుంది. ఇతరుల్నికూడ అది వంచించ నవసరంలేదు. ఎందుచేతంటే, ఇతర కష్టజీవులకు నష్టం కలిగించి తాను ప్రత్యేక

సౌకర్యాలు పొందాలని అది కోరదు. కార్మికవర్గం మిగతా మానవజాతి నంతటినీ విముక్తిచేయనిదే, ఒక మనిషిని మరొకమనిషి దోచుకునే విధానాన్ని రద్దుచేయనిదే తన్ను తాను విముక్తి చేసుకోలేదు.

కార్మికవర్గం ఎప్పుడైతే ఒక శాస్త్రీయ సిద్ధాంతాన్ని చేబట్టి, ఒక రాజకీయ పార్టీని నిర్మించి, శ్రామిక ప్రజలందర్నీ తనవైపు సమీకరించి, పెట్టుబడిదారీ విధానం యొక్క నియమాల ఆధారంపై సోషలిజాన్ని నిర్మించేదిశగా పోరాటాన్ని నడుపుతుందో, అప్పుడు కార్మికవర్గం పెట్టుబడిదారీ సమాజం మధ్యలోనే చైతన్యయుతంగా చారిత్రక నియమాలను వర్తింపజేయడం ప్రారంభిస్తుంది. శ్రామికవర్గం తీసుకువచ్చే సామాజిక విప్లవం చరిత్రలోనే ఒక సరికొత్త విప్లవం. ఈ విప్లవంలో శ్రామిక ప్రజల అగ్రగామి ఐన మార్క్సిస్టు – లెనినిస్టు పార్టీ తన చారిత్రక కృషియొక్క భౌతిక ప్రాధాన్యతను స్పష్టంగా అర్థం చేసుకుని, ప్రస్తుత వ్యవస్థను విప్లవాత్మకంగా మార్చేటందుకు చైతన్యయుతంగా ప్రజల పోరాటానికి నాయకత్వం వహిస్తుంది.

## సామాజికాభివృద్ధి నియమాలను అర్థంచేసుకుని వర్తింపజేయడంలో ప్రావీణ్యం

సోషలిజం విజయం సాధించినప్పుడే సామాజికాభివృద్ధి నియమాలను అర్థంచేసుకుని వర్తింపజేయడంలో నిజమైన ప్రావీణ్యం ప్రదర్శింపబడే శకం ప్రారంభమవుతుంది. అప్పుడు ఉత్పత్తి సాధనాలు సమాజ యాజమాన్యం కిందికి వస్తాయిగనుక ప్రజలు మొత్తం సామాజికోత్పత్తిని తమ కంట్రోలు కిందికి తెచ్చుకోగల్గుతారు. ఆర్థిక వ్యవస్థయొక్క వివిధ శాఖలమధ్య, సమీకరణ – వినిమయాలమధ్య, ఉత్పత్తి సాధనాల – వాడకం వస్తువుల మధ్య, ప్రజల ఆదాయాల మధ్య యిలాగే అనేకవాటిమధ్య శాస్త్రీయమైన నిష్పత్తులు స్థాపించగల్గుతారు. కీలకమైన ఉత్పత్తి సాధనాలన్నీ సోషలిస్టు సమాజంయొక్క యాజమాన్యం కిందికి రావడంతో ప్రణాళికాబద్ధమైన ఆర్థిక వ్యవస్థను రూపొందించడానికి అవకాశమేర్పడుతుంది; దానివల్ల వేగంగా అభివృద్ధి సాగుతుంది. అదే సమయంలో సామాజిక జీవితంయొక్క మౌలిక

ప్రాతిపదికను - అంటే పదార్థ ఉత్పత్తి, ఆర్థిక సంబంధాలు - ప్రజలు తమ సమష్టి నైపుణ్యం కింద ఉంచుకోడం ద్వారా, తమ మధ్య ఉండే యితర సంబంధాలన్నిటినీ చైతన్యయుతంగా సమన్వయ పరచుకోగల్గుతారు.

మానవుడు సామాజిక నియమాలను చైతన్యయుతంగా వర్తింపజేస్తున్నంత మాత్రాన వాటి భౌతిక స్వభావం పోదు. సమాజం ఒకానొక పరిస్థితిలో 'తన బలాబలాలను సులభంగానే తెలుసుకోగల్గుతుంది. భౌతిక పరిస్థితులను దృష్టిలో ఉంచుకుని, ఒకానొక గమ్యాన్ని చేరుకునేటందుకు అది క్రమబద్ధంగా పురోగమించగల్గుతుంది. సామాజిక నియమాలను అర్థం చేసుకోవడంవల్ల ఆ గమ్యం విశదమవుతుంది. ఈ పరిస్థితికీ, ప్రకృతి నియమాలను వర్తింపజేయడానికీ సిద్ధాంతరీత్యా భేదమేమీలేదు. మానవుడు గురుత్వాకర్షణ నియమాన్ని నిర్మూలించలేడు. కాని విమాన గమన సూత్రాలను అతడు తెలుసుకోగలిగితే, భూమియొక్క ఆకర్షణను అధిగమించి గాలిలో ఎగిరే విమానలను నిర్మించగల్గుతాడు. అయితే, జాతీయ ఆర్థిక వ్యవస్థయొక్క ప్రధాన శాఖలను అభివృద్ధి చేయడానికి సరిగ్గా యిదే మార్గమవలంబించలేము. మనం యిష్టంవచ్చిన నిష్పత్తులను స్థాపించడం సాధ్యంకాదు. కాని ఆ నిష్పత్తులు ఎలా వుండాలో భౌతికంగా తెలుసుకోగల్గితే, మొత్తం ఆర్థిక వ్యవస్థయొక్క అవసరాలను దృష్టిలో వుంచుకుని సంక్షోభాలూ, అసమాన అభివృద్ధీ లేకుండా జాగ్రత్త వహించవచ్చు. దాన్ని మరింతగా అభివృద్ధి చేసేందుకు చైతన్యంతో ఒక ప్లానును రూపొందించవచ్చు; ఈ విధంగా సామాజిక పరిణామాలకు వర్తించే ఆవశ్యకత మనకు తెలిసిన ఆవశ్యకతగా ఉంటుంది. ఆ విధంగా సమాజం తన అభివృద్ధిని తాను సాధించుకోగల స్వాతంత్ర్యంగా పరివర్తన చెందుతుంది.

సామాజికాభివృద్ధికి సంబంధించిన నియమాలను అర్థం చేసుకుని వర్తింపచేయడంలో మనం ప్రావీణ్యత సంపాదిస్తే, దానివల్ల కలిగే ఫలితాలు గొప్ప ప్రాముఖ్యతను గలిగియుంటాయి.

మొదటిఫలిత మేమంటే, ప్రజలు ఆ నియమాలకు బానిసలుగా పడి వుండరు; శాస్త్రీయ సిద్ధాంతాన్ని తెలుసుకుని యుండడంద్వారా వారు

ముందుగానే ఆ నియమాలవల్ల కలిగే ఫలితాలను గ్రహించగల్గుతారు; తమ అవసరాల కనుగుణంగా వాటిని నిర్దిష్టమైన మార్గంలో పెట్టగల్గుతారు. క్లుప్తంగా చెప్పాలంటే, ప్రజలు తమ మధ్యనున్న సంబంధాలకూ, వాటిని శాసించే నియమాలకూ అధినాధులవుతారు. సోషలిస్టు సమాజంలో మార్క్సిస్టుపార్టీ, రాజ్యాంగయంత్రం ఆర్థికవ్యవస్థను రూపొందించడానికి నిర్దిష్టమైన చర్యలు తీసుకుంటూ ఉంటాయి. సామాజిక నియమాల్లో వాటికి గల ప్రావీణ్యం ఆ చర్యల్లో ద్యోతకమవుతుంది. సోషలిస్టు ఆర్థిక వ్యవస్థయొక్క భౌతిక నియమాలను గురించి ఎంత ప్రగాఢమైన పరిజ్ఞానం ఉంటుందో, అంత ఆత్మవిశ్వాసంతో పార్టీ, రాజ్యాంగయంత్రం దేశ ఆర్థికాభివృద్ధి మార్గాన్ని నిర్ణయించగలుగుతాయి; అంత ప్రావీణ్యం ఆర్థిక వ్యవస్థను నిర్వహించడంలో అలవడుతుంది; సామాజికోత్పత్తి క్రమంలో అన్ని తక్కువ యాదృచ్ఛిక ఘటనలు, అపసవ్య నిష్పత్తులు సంభవిస్తాయి; అంత శక్తివంతంగా జాతీయ ఆర్థిక ప్రణాళిక లుంటాయి.

రెండవఫలిత మేమంటే, యీ భౌతికనియమాలను తెలుసుకోవడంవల్ల మొత్తం అభివృద్ధిక్రమం యొక్క కడపటి గమ్యాన్ని స్పష్టంగా తెలుసుకోవచ్చు. ఏ వ్యక్తి అయినా తన లక్ష్యమేమిటో తెలుసుకున్న తర్వాత, దాన్ని సాధ్యమైనంత తక్కువ శ్రమతో, తక్కువ ఖర్చుతో సరాసరి చేరుకోగలడు. మనం వివిధ దశలను ఒకదాని తర్వాత ఒకటి చేరుకోగలమేగాని, ఒక్కసారిగా అనేకదశలు దాటడం సాధ్యంకాదు. అయితే, ఒక్కొక్క దశ చేరుకోడానికి పట్టే కాలాన్ని తగ్గించవచ్చు; అనవసరమైన త్యాగాలను నివారించవచ్చు; ప్రయత్నాలు వృధాకాకుండా, భౌతిక విలువలు నిరర్థకమవకుండా చేయవచ్చు.

మూడవ ఫలితం, భౌతిక అభివృద్ధి మార్గానికీ, అధిక సంఖ్యాక ప్రజల ప్రయోజనాలు, ప్రయత్నాలు, అభిష్టాలకూ మధ్య సమన్వయ మేర్పడినప్పుడు, వారిలో సృజనాత్మకమైన చొరవ ఉత్పన్నమౌతుంది. తమ గమ్యాన్ని చేరుకునేటందుకు వారిలో అసాధారణమైన శక్తీ, మనోనిశ్చయం కలుగుతాయి.

# 6. బూర్జువా సమాజవిజ్ఞాన శాస్త్రం యొక్క నిర్వీర్యత, చారిత్రక నియమాలపట్ల భీతి

ఒక వైపు చారిత్రక భౌతికవాదం సామాజికాభివృద్ధి యొక్క భౌతిక నియమాలను వెల్లడించి, వాటిని తెలుసుకునేందుకు మార్గం చూపి, సమాజ శ్రేయస్సుకై వాటిని వర్తింపజేయటమెలాగో చెబుతూంటే, బూర్జువా సమాజ విజ్ఞానశాస్త్రం అసలు చారిత్రక నియమాలేవని రుజువుచేసేటందుకు, లేదా వాటి స్వభావాన్ని అపభ్రంశమొనర్చేటందుకు అన్నివిధాలా ప్రయత్నిస్తోంది.

బూర్జువా సామాజిక శాస్త్రజ్ఞులు ఈ ధోరణిని కాకతాళీయంగా అలవరచుకోలేదు. ఒకనాడు బూర్జువావర్గం అభ్యుదయశక్తిగా ఉండేది. అప్పుడు దాని సిద్ధాంతవేత్తలు సమాజాన్ని ప్రకృతిలో ఒక భాగంగా పరిగణించారు. దాని అభివృద్ధికి సంబంధించిన "ప్రకృతి నియమాలను" కనిపెట్టడానికి ప్రయత్నించారు. ఈ ప్రయత్నాలు చివరకు చరిత్రను గురించిన భావవాద దృక్పథాన్ని దాటి వెళ్ళకపోయినా, సామాజికశాస్త్రాల అభివృద్ధికి అవి గొప్ప ప్రాధాన్యం కలిగివున్నాయి. కాని పెట్టుబడిదారీ విధానం అవసానదశకు చేరుకుంటున్న ఆధునిక యుగంలో అట్టి పరిస్థితి లేదు.

ఆధునిక యుగంలో అక్టోబరు సోషలిస్టు మహావిప్లవం విజయం పొందడం, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ అవతరించడం, సామ్రాజ్యవాద వలసవిధానం విచ్ఛిన్నమవడం మొదలైన అత్యంత ప్రధానమైన ఘటనలు జరగడానికి కారణమేమని భావించాలి?

అవి చారిత్రకంగా ఆవశ్యకమైనవని గుర్తించడమంటే, పెట్టుబడిదారీ విధానం అనివార్యంగా కూలిపోయి సోషలిజం అవతరిస్తుందని అంగీకరించడమవుతుంది. అనగా, బూర్జువా సిద్ధాంతం నుంచి విడివడ్డమన్నమాట. దీని అర్థం, బూర్జువా సమాజ విజ్ఞానశాస్త్రాన్ని విసర్జించడమే. కాని సమకాలీన ఘటనల్లో భౌతిక నియమాల పాత్రను నిరాకరిస్తే, తప్పనిసరిగా చారిత్రక ఆవశ్యకతను తిరస్కరించడమే అవుతుంది. సామాజిక సంబంధాల శాస్త్రీయ పరిశీలనను విసర్జించడమే

అవుతుంది. నిజానికి ఆధునిక బూర్జువా సమాజ విజ్ఞానశాస్త్రం యొక్క లక్షణమే యిది. పెట్టుబడిదారీ విధానం నశించక తప్పదని నిరూపించే చారిత్రక నియమాలపట్ల భీతితో బూర్జువా సామాజిక శాస్త్రజ్ఞులు మార్క్సిజం – లెనినిజం మీద తీవ్రమైన దాడులు చేస్తున్నారు; అసలు పరిస్థితిని వక్రంగా చిత్రిస్తున్నారు.

## విశదీకరణకు బదులు వర్ణన

ఆధునిక బూర్జువాసమాజ విజ్ఞానశాస్త్రం యొక్క, ముఖ్యంగా అమెరికాలో వ్యాప్తిలోవున్న బూర్జువా సమాజ విజ్ఞానశాస్త్రం యొక్క ప్రత్యేక లక్షణం ఏమంటే, అది కేవలం వర్ణనకే, స్వీయానుభవానికే పరిమితమవుతుంది. బూర్జువా సమాజ విజ్ఞానవేత్తలు సామాజిక జీవితంలోని అనేక అత్యంత విభిన్నమైన పరిణామాలను వర్ణిస్తారు; చాలా అప్రధానమైన వాటినికూడా వర్ణిస్తారు. గతంలోని సమాజ విజ్ఞానసూత్రాల లక్షణాలైన స్వీయమానసికతత్వాన్నీ (Subjectivism), ఊహాత్మక ధోరణినీ (Speculation) వ్యతిరేకించేందుకు యీ విధమైన వర్ణన ప్రధాన హామీ– అని పరిగణిస్తారు. తాము నిర్దిష్టమైన కార్యక్రమాన్ని దేనినీ ప్రతిపాదించడంలేదనీ, తాము సేకరించిన సమాచారాన్ని ముందుంచడంమాత్రమే చేస్తున్నామనీ, యింతకన్న "బాహ్యాత్మక విజ్ఞానశాస్త్రం" యివ్వగలదేమీ ఉండదనీ వారంటారు.

ఈ విధంగా, వారు సామాజిక సంబంధాల శాస్త్రీయ పరిశీలనను, బాహ్యాత్మక పరిశీలనను పేరుకు మాత్రమే ప్రశంసిస్తారు. అయితే, వారు ప్రయోగించే "శాస్త్రీయ దృక్పథం" అనే మాటకు అర్థం, ఒక్కొక్క విషయాన్ని యితర విషయాలనుంచి విడదీసి వర్ణించడం మాత్రమే; ఏ విధమైన సామాన్యీకరణకు అది పూనుకోదు. ఈ పద్ధతిని సమర్థించుకోడానికి, సామాజిక జీవితం అత్యంత క్లిష్టమైనదనీ, పథకాలు తయారుచేయడంవల్ల ప్రమాదాలేర్పడతాయనీ పైకెంతో ఆమోదయోగ్యంగా కనిపించే వాదనలు చేస్తారు. ప్రపంచంలో సరిగ్గా ఒకరిని పోలినవారు ఇంకొకరుండరు గనుక, సరిగ్గా ఒక ఘటనను పోలిన ఘటన ప్రపంచంలో జరగదు గనుక చారిత్రకాభివృద్ధిని గురించి సాధారణ నియమాలేవీ ఉండవని వీరంటారు.

కాని, ఈ వాదన పూర్తిగా నిరాధారమైనది. ప్రతి చారిత్రక ఘటన ప్రత్యేక స్వభావం గలిగినదే; తిరిగి తిరిగి అది జరగనిమాటకూడ నిజమే. ప్రపంచంలో మరొక నెపోలియన్ పుట్టడు; హిట్లర్ ఆత్మహత్య మరొకసారి జరగదు. కాని, ఒకానొక ఘటన లేదా క్రమం ప్రత్యేక స్వభావం కలిగియున్నంత మాత్రంచేత, ఆ ప్రత్యేక ఘటనలో, లేదా క్రమంలో కొన్ని సామాన్య లక్షణాలుండవని కాదు; పునరావృత్తమయే లక్షణాలుండవనీ కాదు. వాటన్నిటినీ సామాన్యీకరించినట్లయితే, మనం ఒక ఖచ్చితమైన నియమాన్ని కనుగొనవచ్చు. మొదటి ప్రపంచ యుద్ధంయొక్క, రెండవ ప్రపంచ యుద్ధంయొక్క మూలానికి సంబంధించిన పరిస్థితులు ఎంత భిన్నంగా వున్నప్పటికీ, అంత్యపరిశీలనలో అవి ఒకేవిధమైన కారణాలవల్ల జరిగాయని తెలుసుకోవచ్చు. అంటే, సామ్రాజ్యవాద రాజ్యాలు ఆర్థికంగాను, రాజకీయంగాను అసమానంగా అభివృద్ధి చెందుతూండడంవల్ల, వాటిమధ్య వైరుధ్యాలు అంతకంతకు తీవ్రమై, యుద్ధాలకు దారితీశాయి. సామాజికాభివృద్ధి యొక్క ఈ సాధారణ లక్షణాలను, పునరావృత్తమయ్యే ఈ లక్షణాలను శ్రద్ధతో పరిశీలించడంవల్ల పిడివాదం, యాంత్రికదృష్టి యేర్పడకుండా ఉంటాయి. బూర్జువా సామాజిక శాస్త్రవేత్తలూ, వారిని అనుసరిస్తూన్న సమకాలీన రివిజనిస్టులూ సరిగ్గా ఈ ఆరోపణే చేస్తున్నారు. నిజం చెప్పాలంటే, సామాజిక పరిణామాలను పరిశీలించడానికి ఈ సామాన్య లక్షణాలను శ్రద్ధతో పరిశీలించవలసి యుంటుంది. ఎందుచేతంటే, వాటిని పోల్చిచూడడానికి అదే శాస్త్రీయపునాది.

కాని, బూర్జువా సమాజ విజ్ఞానశాస్త్రానికి ఇట్టి సామాన్యీకరణ లంటే భయం. కారణమేమంటే, పెట్టుబడిదారీవిధానం కూలిపోకతప్పదని యీ సామాన్యీకరణలు ఖండితంగా నిరూపిస్తాయి. సందర్భశుద్ధిలేని సమాచారాన్ని, లేదా చారిత్రక పరిణామానికి సంబంధించిన సాధారణ నియమాలనుంచి విడగొట్టబడిన సంఖ్యా వివరాల ధోరణిని పరిశీలించడంవల్ల, అతి ప్రధానమైన సామాజిక సమస్యల నుంచి మనదృష్టి పక్కమార్గాలకు మళ్ళించబడ్డమేకాక, ఆ సమస్యలు మరుగు పడ్డంకూడా తటస్థిస్తుంది. అంతేకాదు బూర్జువా సమాజ విజ్ఞానవేత్తలు చేసే పరిశీలనల్లో అధికభాగం పెట్టుబడిదారీ సమాజంలోని

పాలకవర్గాలకు ఉపయోగపడతాయి. ఉదాహరణకు వివిధ తరగతుల ప్రజలమధ్య జాతీయాదాయం ఎలా విభజింపబడుతూందో తెలియజేసేందుకు బూర్జువా సమాజ విజ్ఞానవేత్తలు కొన్ని లెక్కల శాతాలిస్తూ వుంటారు (Average figures). వాటివెనుక నగ్నమైన వర్గ అసమానతలు దాగివుంటాయి; గుత్తాధిపతుల పెత్తనం మరుగున పడివుంటుంది. దాన్నే వారు "శ్రేయోరాజ్యం" (Welfare State) అని పిలుస్తారు. పెట్టుబడిదారీ విధానం శాశ్వతంగా, ఎట్టిమార్పూ లేకుండా వుంటుందని వారు భావిస్తారు; ఈ సమాజంయొక్క అవసరాలకు తగినట్లు వ్యక్తులు తమ్ము తాము "మలచుకునేం"దుకు సహాయపడ్డమే వారి లక్ష్యం. సాధారణంగా ఇట్టి పరిశీలనలు పెట్టుబడిదార్లకు "క్రియాత్మక విలువ" గలవై యుంటాయి. వారు మరింత చక్కగా తమ ప్రచారాన్నీ, ప్రకటనలు మొదలైనవాటినీ రూపొందించుకునేందు కవి సహాయపడతాయి. అంతేగాని, ప్రజల్ని వేధించే ప్రధాన సమస్యలకు శాస్త్రీయ సమాధానాలను వాటినుంచి ఆశించడం నిరుపయోగం.

## సామాన్యీకరించగల సిద్ధాంతం కొరకు అన్వేషణ

ఆధునిక బూర్జువా సమాజ విజ్ఞానవేత్తల గ్రంథాల్లో అధికభాగం ప్రత్యేక స్వీయానుభవానికి సంబంధించిన పరిశీలనలతో నిండి వుంటాయి. కాని, యీ సమాజ విజ్ఞానవేత్తలు, మార్క్సిజాన్ని జయప్రదంగా యెదుర్కొనేందుకుగాను తమ పరిశీలనల నుంచి సామాన్యీకరించగల ఒక సిద్ధాంతం వంటిది అవసరమని అంతకంతకు తరచుగా అంగీకరిస్తూ వుంటారు. పాశ్చాత్యదేశాల్లో యించుమించు ప్రతినెలా అట్టి సిద్ధాంత మొకటి కనుక్కోబడిందంటూ పెద్ద అట్టహాసంతో ప్రకటనలు వెలువడుతుంటాయి. కాని, అలా కనుక్కోబడిన ప్రతి కొత్త సిద్ధాంతం ఒకరోజుకన్న యెక్కువ నిలిచేవి కావని త్వరలోనే స్పష్టమవుతూ వుంటుంది.

కొందరు బూర్జువా సమాజ విజ్ఞానవేత్తలు చారిత్రక నియమాల స్థానంలో జీవశాస్త్ర సమాచారాన్ని (Biological data) ప్రవేశపెడుతూ వుంటారు. (సోషల్ డార్వినిజం, మాల్థూషియనిజం, రేసిజం) దీన్ని

బలపరిచేవారు ఇలా వాదిస్తారు: మానవుడు ప్రకృతిలో భాగం గనుక ఇతర జీవరాసుల అభివృద్ధికి సంబంధించిన నియమాలే సామాజికాభివృద్ధికి కూడా వర్తిస్తాయి: ప్రకృతిలో విభిన్న జాతుల ప్రాణులు ప్రకృతిచే వరింపబడుతున్నాయి; బతుకుదెరువుకోసం జరిగే పోరాటంలో అన్నిటికంటె బలమైనవి మాత్రమే జీవించగలుగుతున్నాయి. అందుచేత, సమాజంలో కూడా ఇలాగే జరుగుతూండాలి. దీనినుంచి వారు వర్గపోరాటం బతుకు దెరువుకోసం జరిగే పోరాటమనీ, పెట్టుబడిదారీ దోపిడి, వలసదోపిడీ మొదలైనవన్నీ మానవుని పరిణామ లక్షణాలనీ వారు వాదిస్తారు. బలవంతులు బలహీనుల్ని ఎల్లప్పుడూ ఓడించవలసిందేననీ, మరో విధంగా జరగడం అసంభవమనీ వారంటారు. ఈ విధంగా పెట్టుబడిదారీ ఆటవిక నియమాలను జీవశాస్త్ర నియమాలద్వారా వీరు సమర్థిస్తారు. అవి అనివార్యమనీ, శాశ్వతమైనవనీ వాదిస్తారు.

ఇంతకంటె అవాస్తవికమైన వాదన మరొకటి ఉండబోదు. అత్యంత జుగుప్సాకరమైన జాతి ద్వేషానికీ, తదితరద్వేషాలకూ మూలం ఈ సిద్ధాంతాలే. లెనిన్ ఈ విధంగా రాశాడు:

"సంక్షోభాలు, విప్లవాలు, వర్గపోరాటం వంటి పరిణామాలకు శక్తి స్వరూప ముద్రలు, జీవశాస్త్ర ముద్రలు వేయడంకన్న సులభమైన పని మరొకటి లేదు. ఇంతకంటె నిరర్థకమైన, నిర్జీవమైన, మూఢమైన పనికూడా ఇంకొకటి వుండబోదు."[8]

సామాజికాభివృద్ధికి సంబంధించిన నియమాలు ప్రత్యేకమైనట్టివి. వాటికీ ప్రకృతి నియమాలకూ గుణాత్మకమైన భేదం వుంది. జంతువులు క్రియారహితంగా ప్రకృతికి లోబడి తమ్ము తాము మలుచుకుంటాయి. కాని మానవుడు తనకవసరమైన భౌతిక సదుపాయాలన్నిటినీ స్వయంగా తయారుచేసుకుంటాడు. ఈ కారణంవల్ల పెట్టుబడిదారీ విధానం శ్రామిక ప్రజలమీద రుద్దే విపత్తులన్నిటినీ సమర్థించడానికి జీవశాస్త్ర నియమాలను ప్రవేశపెట్టడం చాలహేయమైన పని; ఇది విమర్శించడానికి కూడా అర్హతలేని పద్ధతి. కొంతమంది బూర్జువా సామాజిక శాస్త్రజ్ఞులు,

---

8. లెనిన్: Works, Vol 14, Page 314 (Materialism and Empirio - criticism. Moscow 1952, Page 342)

అభివృద్ధినిరోధకుడైన మల్‌తూస్ శిష్యులు. భూమిమీద జనాభా అధికమయిందని ఎంత గొంతులు చించుకున్నా మానవజాతి అంతకంతకు వృద్ధి చెందుతూన్న తన భౌతికావసరాలను తీర్చుకునేటందుకు సకల అవకాశాలూ భూమిమీద వున్నాయి. ఒక మానవుడు మరొక మానవుని పీడించేపద్ధతి, దానినుంచి ఉద్భవించే వర్గపోరాటం "బతుకుదెరువుకోసం జరిగేపోరాట" రూపంకాదు; ఒక నిర్దిష్టమైన, చారిత్రకంగా తాత్కాలికమైన సాంఘిక ఆర్థిక వ్యవస్థయొక్క ఫలితం అది. సోవియట్ యూనియన్‌లోను, నూతన ప్రజాతంత్ర దేశాలలోను సోషలిజాన్ని నిర్మించడంలో లభించిన అనుభవాన్నిబట్టి తెలిసేదేమంటే, వర్గ అసమానతే అభివృద్ధికి నిరంతర చోదకశక్తి అనే బూర్జువా శాస్త్రవేత్తల వాదన తప్పు అని సోషలిస్టు వ్యవస్థ నిరూపించింది. అధిక జనాభాకు నిదర్శనంగా వారు చూపే నిరుద్యోగాన్ని రద్దు చేసింది. సరిగ్గా అదే విధంగా ప్రాచ్య దేశాలలో నివసించే వలస, పరాధీనప్రజలు కూడా చైతన్యవంతులై, సాంఘిక, ఆర్థిక సంస్కృతిక రంగాలలో వేగంగా పురోగమిస్తున్నారు. దీన్నిబట్టి "రంగుజాతుల" ప్రజలు "హీనులు" అనే హేయమైన "సిద్ధాంతం" యెంత అర్థరహితమైనదో. ప్రపంచాన్ని పరిపాలించడానికి "జీవశాస్త్ర" దృష్ట్యా తెల్లజాతులకున్నదని చెప్పే "హక్కు" ఎంత హేయమైనదో బోధపడుతుంది.

జీవశాస్త్రంనుంచి తీసుకొనే సామ్యాలెంత బలమైనవో గ్రహించి, ఆధునిక బూర్జువా సమాజవిజ్ఞానవేత్తల్లో అధిక సంఖ్యాకులు సామాజిక జీవితాన్ని అర్థం చేసుకునేందుకు మనస్తత్వ శాస్త్రాన్ని (Psychology) ఆశ్రయిస్తున్నారు. అంతేకాక, ఆధునిక బూర్జువా సమాజ విజ్ఞానవేత్తలు మానవుని మనస్సునే హేతుబద్ధంకాని విధంగా పరిశీలిస్తారు. మానవుణ్ణి చైతన్యయుత జీవిగా కాక, ప్రధానంగా చైతన్యరహిత ప్రేరణలకూ, జీవరాసు లన్నిటిలోను ఉండే సహజప్రవృత్తులకూ (Biological instincts) వశుడై ప్రవర్తించువానిగా చిత్రిస్తారు. ఆస్ట్రియన్ మనస్తత్వ శాస్త్రజ్ఞుడు, సమాజవిజ్ఞానవేత్త అయిన సిగ్మండ్ ఫ్రాయిడ్ భావాలు బూర్జువా సమాజవిజ్ఞానశాస్త్రంపై బలమైన ప్రభావం కలిగించాయి. అతని అభిప్రాయం ప్రకారం, మానవ వ్యాపారం జంతు ప్రవృత్తులచే (Animal instincts), ముఖ్యంగా లైంగిక ప్రవృత్తిచే (Sexual instincts)

నిర్ణయింపబడుతుంది; మానవ చైతన్యం కేవలం చైతన్యరహిత ప్రవృత్తుల. వాంఛల ఉపరితల (Super structure) మాత్రమే. అందువల్ల, యుద్ధ నివారణ మొదలైన కార్యాలను సాధించడానికి సామాజిక సంబంధాలపై చైతన్యయుతమైన ప్రభావం కలిగించడం అసాధ్యమని బూర్జువా సమాజ విజ్ఞానవేత్తలు నిర్ధారణ చేస్తూ వుంటారు; విప్లవోద్యమాలను "సామూహిక హిస్టీరియా"గా జమకడుతూ వుంటారు.

బూర్జువా సమాజ విజ్ఞానశాస్త్రం ప్రజాస్వామ్యం కొరకు, సోషలిజం కొరకు చైతన్యయుతంగా పోరాడే ప్రజాసామాన్యాన్ని పైపిధంగా నిందించడమేగాక, యీ పోరాటంయొక్క లక్ష్యాన్నే తూలనాడ చూస్తుంది, అందుకు మానవుని జంతు ప్రవృత్తి నెవరూ మార్చలేరని నిరూపించ యత్నిస్తుంది. కాని, మేము పైన వివరించినట్లు, వ్యక్తుల మనస్తత్వం సామాజిక సంబంధాలను నిర్ణయించజాలదు; పైగా చారిత్రక పరిస్థితులే వ్యక్తుల మనస్తత్వాన్ని నిర్ణయిస్తాయి. బూర్జువా సమాజ విజ్ఞానవేత్తలు దురాశ, "ఆస్తి మమకారం" మొదలైన "జంతు ప్రవృత్తు"లను గురించి చాలా చాలా చెబుతారు. నిజానికి యివి కొన్ని నిర్దిష్టమైన సామాజిక పరిసరాలనుంచి ఉత్పన్న మవుతాయి. సోవియట్ యూనియన్‌లోను, నూతన ప్రజాస్వామ్య దేశాల్లోను సోషలిస్టు విప్లవం కొనసాగేదశలో మానవ చైతన్యం సరికొత్త మార్గాల్లో రూపొందింపబడుతూంది. సరికొత్త మానసిక లక్షణాలు తలెత్తాయి. (ఉదాహరణకు, బూర్జువా వ్యష్టితత్వానికి బదులు సమష్టితత్వం). దీన్నిబట్టి, మానవ స్వభావాన్ని మార్చలేమన్న బూర్జువా సమాజ విజ్ఞానవేత్తల వాదన ఎంతతప్పో రుజువవుతుంది.

లెనిన్ యిలా రాశారు:

"విజ్ఞాన శాస్త్రంనుంచి నియమాలను తొలగించివేయడమంటే, ఆచరణలో మత సూత్రాలను లాక్కువచ్చి ప్రవేశపెట్టడమే."[9]

బూర్జువా సమాజ విజ్ఞానశాస్త్రంలో ఉన్న స్వీయానుభవ వాదానికి తోడు బాహాటమైన మాయావాద, మతవాద, చారిత్రక దృష్టికూడా జోడింపబడుతోంది. ఆర్నాల్డ్ టాయిన్‌బీ అను ప్రఖ్యాత బ్రిటిష్ చారిత్రకవేత్త "చరిత్ర అధ్యయనం" (A Study of History) అనే

---

9. లెనిన్ కలెక్టెడ్ వర్క్స్. 4వ రష్యన్ కూర్పు, 20వ సంపుటి, పుట 192.

పన్నెండు సంపుటాల గ్రంథం రాశాడు. అందులో అతడు స్పష్టంగా "భగవంతుని నిగూఢ శక్తి" చారిత్రకగతిని నిర్ణయిస్తూందని రాశాడు. నియో థామిస్టు తత్వవేత్తలు చారిత్రకగతిలో "భగవదాజ్ఞ" గురించీ, దాని "గూఢార్థం" గురించీ చాలా గట్టిగా వాదిస్తారు. అసంఖ్యాకమైన కేథలిక్ సమాజ విజ్ఞానవేత్తలు, రచయితలు "చరిత్రయొక్క అంతాన్ని" గురించి తీవ్రంగా వాదిస్తూ వుంటారు: అది ఎప్పుడంతమయేదీ కూడా జ్యోతిషం చెబుతారు. ఇవన్నీ కమ్యూనిస్టు వ్యతిరేక ధోరణిని తెలియజేస్తాయనేది స్పష్టం.

బూర్జువా సమాజ విజ్ఞానశాస్త్రం భావవాదంతో సన్నిహిత సంబంధం కలిగియుంది; దాని లాగే యిదికూడా, చరిత్ర అనే పరీక్షకు నిలబడలేదు; జీవితం మన ముందుంచిన సమస్యలకు శాస్త్రీయ సమాధానాలీయలేదు. ఆధునిక బూర్జువా సమాజవిజ్ఞానశాస్త్రం యొక్క మౌలిక భావాలు: గుత్తపెట్టుబడి సంస్థల ఆధిపత్యాన్నీ, వాటి దురాక్రమణ విధానాన్నీ, ప్రజావ్యతిరేక చర్యలనూ సిద్ధాంతరీత్యా సమర్థించడం; వాటి దోపిడీని బలపర్చడం; సమాజ యాజమాన్యాన్నీ, సమష్టి తత్వాన్నీ అప్రతిష్టపాల్జేయడానికి ప్రయత్నించడం.

# 7. ఇతర సమాజ విజ్ఞాన శాస్త్రాలకూ, సామాజిక ఆచరణకూ చారిత్రక భౌతికవాద దృక్పథం యొక్క ప్రాధాన్యం

## చారిత్రక భౌతికవాదం, సామాజికశాస్త్రాలు

పై విషయాలనుబట్టి, చారిత్రక భౌతికవాదం వివిధ సామాజికశాస్త్రాలకూ, కార్మిక పార్టీల కార్యకలాపాలకూ ఎంత ప్రాముఖ్యత వహిస్తుందో బోధపడుతుంది. చరిత్ర, అర్థశాస్త్రం, న్యాయశాస్త్రం, నీతిశాస్త్రం, రసదర్శనం (Aesthetics) మొదలైన సామాజిక శాస్త్రాలు సామాజికజీవితం యొక్క ప్రత్యేక రంగాలను, లేదా ప్రత్యేక దేశాల ప్రజల చరిత్రను పరిశీలిస్తాయి. అర్థశాస్త్రం సామాజికోత్పత్తికీ, భౌతిక పదార్థాల పంపకానికీ సంబంధించిన నియమాలను పరిశోధిస్తుంది; న్యాయశాస్త్రం సమాజంయొక్క రాజకీయ ఉపరి నిర్మాణాన్ని - అంటే శాసన

సముదాయం, రాజ్యాంగ యంత్రమూ - పరిశోధిస్తుంది; నీతిశాస్త్రం సమాజంయొక్క నీతికి సంబంధించినది. ఇలాగే మిగతా శాస్త్రాలూను. చారిత్రక భౌతికవాదం సామాజికాభివృద్ధికి సంబంధించిన సాధారణ నియమాలను తెలియజేసే శాస్త్రం. చారిత్రక భౌతికవాద సూత్రాలు, నిర్ధారణలు - అంటే, సామాజిక చైతన్యం సామాజిక జీవితంమీద ఆధారపడ్డం గురించీ, సామాజిక వ్యవస్థలో మార్పులు ఉత్పత్తి శక్తులలో జరిగే మార్పుల కనుగుణంగా ఉండడం గురించీ, పునాదికీ ఉపరి నిర్మాణానికీ గల సంబంధం గురించీ, యిలాగే ఇంకా యితర విషయాలను గురించీ తెలియజేసే సూత్రాలు, నిర్ధారణలు - మొత్తం సామాజిక జీవితానికి సంబంధించిన నియమాలను తెలియజేస్తాయి. ఏ ప్రత్యేక సామాజిక శాస్త్రమూ చారిత్రక భౌతికవాదం మాదిరిగా అంత విస్తృతమైన సామాన్యీకృత సూత్రాలను పరిశోధించదు. అందుచేత చారిత్రక భౌతికవాదం సామాజిక శాస్త్రాలన్నింటికీ ప్రాతిపదిక. ఇతర సామాజిక శాస్త్రాల స్థానాన్ని అది ఆక్రమించదు; అయితే, జ్ఞానసంపాదనకు మార్గంగా ఉంటూ అది వాటికి సహాయం చేస్తుంది. రెండోవైపు సామాన్యీకృత సూత్రాలను రూపొందించడంలో అది యితర సామాజికశాస్త్రాల నుంచి సమస్త విషయాలూ తెలుసుకుంటుంది. చారిత్రక భౌతికవాదం వెల్లడించే సాధారణ సూత్రాలను తెలుసుకుంటే, సామాజిక జీవితంయొక్క వివిధ రంగాల అభివృద్ధిని గురించీ ఒకానొక దేశంయొక్క నిర్దిష్ట చరిత్రను గురించీ మనం తెలుసుకోగలం. ఏ సామాజిక శాస్త్రమూ తన ప్రత్యేకరంగానికీ యితర జీవితరంగాలకూ గల సంబంధాన్ని తెలియజేయకపోతే, సామాజిక పరిణామాలన్నిటిలోను తన స్థానాన్ని కనిపెట్టకపోతే, తన ప్రత్యేక రంగాన్ని అది సరిగా అర్థంచేసుకోలేదు.

అదే సమయంలో చారిత్రక భౌతికవాదం సకల సమస్యలకు పరిష్కార మార్గంకాదు; ఏ చారిత్రక పరిస్థితికైనాసరే, ఏ పరిణామానికైనా సరే దాన్ని వర్తింపజేసినప్పుడు అది మనకు కరతలామలక మవుతుందని భావించకూడదు. చారిత్రక భౌతికవాద దృక్పథమున్నట్లయితే, చారిత్రక ఘటనలను సరిగా అర్థంచేసుకోడానికి చక్కని దిక్సూచి ఒకటి పరిశీలకుని చేతికి లభిస్తుందన్నమాట. అయితే అతడు వాస్తవిక దృష్టితో ఘటనలను,

పరిణామాలను పరిశీలించవలసిందే; వాటికి కారణభూతమైన పరిస్థితులను అవలోకించవలసిందే. దీని అర్థమేమంటే, ప్రతి సందర్భంలోను చరిత్ర తెలియజేసే సమాచారాన్నంతటినీ, వాస్తవ విషయాలనన్నిటినీ కూలంకషంగా పరిశోధించాలి. ఈ విధంగానే, వివిధ ఘటనల మధ్యగల ఆంతరంగిక సంబంధాన్ని మనం కనిపెట్టగలం; విశదీకరించగలం. గతాన్ని గురించీ, వర్తమానాన్ని గురించీ తెలుసుకోవడమేగాక, భవిష్యత్తునుకూడ ముందే శాస్త్రీయంగా తెలుసుకోడానికి మార్గమిదే.

## శాస్త్రీయ దూరదృష్టి

సమాజం కొన్ని భౌతికనియమాల ననుసరించి అభివృద్ధి చెందుతుందన్నవిషయాన్ని అంగీకరించని బూర్జువాతత్వవేత్తలు, సామాజికశాస్త్రజ్ఞులు భవిష్యత్తు ప్రజల ఉద్దేశాలపైనా అభీష్టాలపైనా ఆధారపడి వుంటుందనీ, వాటిని గురించి ముందుగా ఎవరూ చెప్పలేరనీ, అందువల్ల భవిష్యత్తును గురించి శాస్త్రీయ దృక్పథంతో తెలుసుకోవడం సాధ్యంకాదనీ చెబుతారు.

కాని, ప్రజల భౌతిక జీవిత పరిస్థితుల్నిబట్టి వారి ప్లానులు, ఆశయాలు ఉంటాయని పైన మనం తెలుసుకున్నాం. అందుచేత, సామాజికాభివృద్ధికి సంబంధించిన నియమాలవల్ల ద్యోతకమయే ధోరణులు మనకు తెలిసివున్నట్లయితే, ముందుముందు జరిగే పరిణామాలను కనిపెట్టగల్గుతాం. ఇంతకూ, భవిష్యత్తు శూన్యంనుంచి పుట్టదు; వర్తమానంలో ఉన్న అవకాశాలే భవిష్యత్తులో కార్యరూపం ధరిస్తాయి.

సామాజికాభివృద్ధికి సంబంధించిన నియమాలు తెలిసివున్నట్లయితే, మనం చారిత్రక గమనంయొక్క సాధారణదిశను మాత్రం కనుగొనగలం; కాని వివరాలనూ నిర్దిష్టరూపాలనూ తెలుసుకోవడం సాధ్యంకాదు. అనేక సామాజిక పరిణామాల స్వరూపం, కాలం యాదృచ్ఛిక పరిస్థితులచే నిర్దేశింపబడతాయి. వాటిని ఎంత కుశాగ్రబుద్ధిగలవారైనా సరే ముందుగా కనుక్కోలేరు. కాని, సాధారణ గతిక్రమాన్ని ముందుగా తెలుసుకోగల్గితే, దానికి గొప్ప క్రియాత్మక ప్రాధాన్యత ఉంటుంది.

మార్క్సు, ఎంగెల్స్‌లు సుమారు నూరు సంవత్సరాల కిందట, పెట్టుబడిదారీ విధానం యింకా ఉచ్ఛదశలో ఉన్నప్పుడు, దానిలోని అంతరంగిక వైరుధ్యాల ఫలితంగా అది శిథిలమై నశిస్తుందని చెప్పారు. ఆ జోశ్యం మన కాలంలో క్రమక్రమంగా నిజమవుతోంది.

మొదటి ప్రపంచ యుద్ధానికి చాలకాలం కిందటే ఎంగెల్స్ అది వచ్చేందుకు గల అవకాశాలను, దానివల్ల కలిగే ఫలితాలను తెలియజేశాడు. రానున్న ప్రపంచ యుద్ధం ఫలితంగా అనేక రాచరిక ప్రభుత్వాలు కూలిపోతాయనీ డజన్ల సంఖ్యలో కిరీటాలు మట్టిలో దొర్లుతాయనీ, పరిశ్రమలు, వ్యాపారం తారుమారవుతాయనీ, యిలాగే చాలా విషయాలు ఆయన రాశాడు.

"ఒకటి మాత్రం తప్పకుండా జరుగుతుంది: అందరూ అలసిపోతారు. కార్మికవర్గం అంతిమ విజయం సాధించడానికి అనుకూలపరిస్థితులేర్పడతాయి" అని ఆయన రాశాడు.[10]

అది నిజమయింది. మొదటి ప్రపంచ యుద్ధం ఫలితంగా, సామ్రాజ్యవాదమనే గొలుసు అత్యంత బలహీనమైనచోట - రష్యాలో - తెగిపోయింది. ఆ దేశంలో కార్మికవర్గం అధికారంలోకి వచ్చింది.

సుమారు అర్ధశతాబ్దం కిందట లెనిన్, ప్రపంచ విప్లవోద్యమానికి కేంద్రం ప్రాగ్దిశకు మారుతుందనీ, ఆ సందర్భంలో రష్యన్ శ్రామికవర్గం సోషలిస్టు విప్లవానికి అగ్రగామిగా వుంటుందనీ చెప్పాడు. సోషలిజం మొదట ఒక దేశంలో, లేదా కొన్ని దేశాల్లో జయిస్తుందని ఆయన మొదటి ప్రపంచ యుద్ధకాలంలో తెలియజేశాడు. ఈ రెండు జోస్యాలూ నిజమని చరిత్ర నిరూపించింది.

మార్క్సిస్టులు అనేక సందర్భాల్లో, ముందు జరగబోయే ఘటనలను గురించి చాల సంవత్సరాలు ముందుగా జోస్యం చెప్పారు. ఉదాహరణకు వలస, పరాధీన దేశాల్లో జాతీయ స్వాతంత్ర్యోద్యమాల విజయం; జర్మనీలో ఫాసిస్టు పాలన నిర్మూలన; రెండవ ప్రపంచ యుద్ధంలో సోవియట్ యూనియన్ నాయకత్వం కింద ప్రజాతంత్ర దేశాల విజయం. ఇలాగే

---

10. ఫ్రెడరిక్ ఎంగెల్స్: (Einleitung Zur Erinnerung Fur die deuts - chen Mordspatrioten, 1806-1807 Von Sigismund Borkheim, Zurich, 1888.)

యింకా ఎన్నో ఉన్నాయి. ఈ జోస్యాలన్నీ నిజమవడానికి కారణమేమంటే, వాస్తవికతను భౌతికదృష్టితో, ఖచ్చితమైన శాస్త్రీయదృష్టితో పరిశీలించడం మీద అవి ఆధారపడ్డాయి, ఆ వాస్తవికతయొక్క ప్రధాన, నియమబద్ధ ధోరణులను దృష్టిలో ఉంచుకుని ఆ పరిశీలనలు జరిగాయి. కాని, బూర్జువా రాజకీయవేత్తలూ, సామాజిక శాస్త్రజ్ఞులూ సోషలిజం తప్పనిసరిగా కూలిపోతుందని, పెట్టుబడిదారీ విధానం పునరుద్ధరింపబడుతుందని చెప్పిన జోస్యాలు పూర్తిగా తలకిందులయాయి. కారణమేమంటే, అవి చరిత్ర యొక్క వాస్తవ నియమాలను విస్మరించాయి; ఊహాత్మక భావాలనుంచి అవి ఉద్భవించాయి. ఈ రోజునకూడా అనేకమంది, "కమ్యూనిజం సంక్షోభంలో పడిం"దని ఉన్మత్త ప్రలాపా లాడుతున్నారు; "మానవ సంస్కృతి మంట కలుస్తుం"దంటూ జోస్యాలు చెబుతున్నారు. వీరి జోస్యాలకు కూడా కాలక్రమంలో అదే గతి పడుతుంది.

## చారిత్రక భౌతికవాదం, కార్మికోద్యమానికి సంబంధించిన కార్యాచరణ

చారిత్రక భౌతికవాదం సామాజికాభివృద్ధికి సంబంధించిన సాధారణ నియమాలను తెలియజేసే శాస్త్రమూ, సామాజిక పరిణామాలను అర్థంచేసుకునేందుకు తోడ్పడేపద్ధతీ గనుక, అది శాస్త్రీయ కమ్యూనిజాని కంతకూ, కమ్యూనిస్టుపార్టీల వ్యూహం – ఎత్తుగడలన్నిటికీ సిద్ధాంత పునాది.

కొన్ని నియమాల ననుసరించి పెట్టుబడిదారీ విధానం స్థానే సోషలిజం ఏర్పడి తీరుతుందని నిరూపించిన మార్క్స్, ఎంగెల్స్‌ల ఉపదేశాలు కార్మిక ప్రజల హృదయాలను ఉత్తేజపరుస్తాయి; తమ లక్ష్యం ఎప్పటికైనా యీడేరి తీరుతుందనే విశ్వాసం వారిలో కలుగుతుంది. కార్మికోద్యమంలో పాల్గొంటున్నవారు విశాల దృక్పథంతో ఆలోచించడం, సమకాలీన ప్రయోజనాలను అంతిమ లక్ష్యాలతో సమన్వయపరచడం, సామాజిక ఘటనల మధ్యనున్న ప్రగాఢ సంబంధాలను పరిశీలించడం, ప్రత్యేక ఘటనల ద్వారా సుదూర భవిష్యత్తును అవలోకించడం – యీ

లక్షణాలు అలవడేటట్లు మార్క్స్, ఎంగెల్స్‌ల ఉపదేశాలు తోడ్పడతాయి. సామాజికాభివృద్ధికి సంబంధించిన నియమాలు తెలిసివున్న వ్యక్తి కమ్యూనిజం కొరకు జరిగే చారిత్రక పోరాటంలో చైతన్యయుతంగా పాల్గొనగల్గుతాడు.

అదే సమయంలో, గతితార్కిక పద్ధతి ప్రతి పరిస్థితినీ, ప్రతిదేశంలోని ప్రత్యేక లక్షణాలనూ, ప్రపంచ పరిణామాలనూ నిర్దిష్టంగా పరిశీలించేటట్లు ప్రోత్సహిస్తుంది. ప్రతి కార్మికవర్గ విప్లవపార్టీ ప్రత్యేకమైన పరిస్థితుల్లో నిర్దిష్టమైన జాతీయ పరిస్థితుల్లో పనిచేయవలసి యుంటుంది. ప్రతిపార్టీ తన పోరాటానికి సంబంధించిన భౌతిక పరిస్థితులను అంచనా వేయడంలోను చారిత్రక ఘటనల గమనాని కనుగుణంగా తన లక్ష్యాలను, సాధనాలను నిర్వచించడంలోను ఎంత ఖచ్చితమైన శాస్త్రీయమైన దృక్పథ మవలంబిస్తే, అంతగా తన కార్యకలాపాల్లో విజయం సాధిస్తుంది.

ఈ పద్ధతిలో ప్రావీణ్యం సంపాదించడమంటే అర్థం, చారిత్రక భౌతికవాద సిద్ధాంతాలను, సాంకేతికాలను కంఠస్థం చేయడంకాదు. ఉదాహరణకు ఉత్పత్తి శక్తులకు, ఉత్పత్తి సంబంధాలకు మధ్య జరిగే ఘర్షణ సామాజిక విప్లవానికి పునాది అనే విషయం జ్ఞాపక ముంచుకోవడం కష్టమేమీ కాదు. కాని కార్మికవర్గపార్టీ ఈ సాధారణ సత్యాన్ని మాత్రమే చెప్పి, తన దేశంలో ఈ సంఘర్షణ ఏ నిర్దిష్టమైన రూపాల్లో వ్యక్తమౌతూందో, వర్గశక్తుల మధ్య సంబంధా లెలావున్నాయో మొదలైన విషయాలు పరిశీలించకపోతే, దానివల్ల ఉపయోగం వుండదు. చారిత్రక భౌతికవాద దృక్పథంలో ప్రావీణ్యం సంపాదించడమంటే అర్థం, సామాజిక పరిణామాలను విశ్లేషించేటప్పుడు భౌతికవాద గతితార్కిక దృక్పథం యొక్క సారాంశాన్ని ఆకళింపు చేసుకోవడం; ఒకానొక సమయంలో కార్మికవర్గ పోరాటనికి సంబంధించిన నిర్దిష్టపరిస్థితులను పరిశీలించేటప్పుడు దాని నెలా వుపయోగించాలో తెలుసుకోవడం; విప్లవోద్యమం యొక్క అపార అనుభవాన్ని సామాన్యీకరించడ మెలాగో నేర్చుకోవడమూను.

అందుచేతనే, చారిత్రక భౌతికవాద దృక్పథం – కార్మికవర్గ విప్లవ పార్టీల ప్రపంచ దృక్పథంలో చాలా ప్రధానమైనస్థానం ఆక్రమిస్తూంది; సోషలిజం కొరకు చైతన్యయుతంగా పోరాడే ప్రతివ్యక్తి యొక్క ప్రపంచ

దృక్పథంలో ఎంతో వున్నతమైన స్థానం అలంకరిస్తుంది. సామాజికాభివృద్ధికి సంబంధించిన నియమాలను అర్థంచేసుకోవాలని, తన కృషికి సంబంధించిన పూర్తి పరిజ్ఞానంతో శ్రామిక ప్రజల శ్రేయస్సుకోసం, అభివృద్ధికోసం పనిచేయాలనీ ఉవ్విళ్లూరే ప్రతివ్యక్తి యొక్క ప్రపంచ దృక్పథంలో ఎంతో ప్రముఖమైన స్థానం అలంకరిస్తుంది.

# వ్యాఖ్యలు

### *1. ఉమ్మడి వ్యవహారాలను సులభంగానే సర్దుబాటు చేసుకొనేవారు*

(పేజీ 19, పంక్తి 15):

భారతదేశంలో ఆర్యులు తమ తొలి నివాస ప్రాంతాల్లో వర్గరహితమైన సమష్టి జీవితవిధానం అనుసరించేవారిని శ్రీ ఎస్. ఎ. డాంగే "భారతదేశం" అనే తన పరిశోధక గ్రంథంలో తెలియజేశారు. అందులో ఆయన "యజ్ఞం" అంటే ఆర్యగణాల సమష్టి ఉత్పత్తి విధానమని నిరూపించారు. అందుకు రుగ్వేదం నుంచి శ్లోకాలను ఉటంకించారు. ఉదాహరణకు, సత్ర యజ్ఞంయొక్క ప్రధాన లక్షణమేమంటే, అందులో పాల్గొనేవారందరూ రుత్విజులే అంటే యజమానులే. అది సంపూర్ణంగా, సమష్టిగా చేయబడేది; ఏ విధమైన భేదాలుగాని, శ్రమవిభజనగాని లేదు. రెండవ లక్షణం, సమష్టి శ్రమవల్ల లభించే యజ్ఞఫలాన్ని సమష్టిగా పంచుకోడం. యజ్ఞఫలం సమష్టిగా అనుభవించబడుతుందన్నమాట. మూడవ లక్షణం, సత్రయజ్ఞంలో పాల్గొనేవారంతా రక్తబంధువులు. అంటే సగోత్రీకులు. రక్తబంధువులుకాని వారికందులో స్థానంలేదు. నాల్గవ లక్షణం, ఉత్పత్తిశక్తులు పెరగడంవల్ల, చేయవలసిన పనులు పెరగడంవల్ల అత్యవసర విధులను నిర్వర్తించడానికి కొందరిని ఎన్నుకుంటారు. యజ్ఞం అయిపోగానే, వీరు మరల గణసమూహంలో కలిసిపోతారు. ఐదవ లక్షణం, యజ్ఞవిధుల్లో స్త్రీలు, పురుషులు కూడా పాల్గొంటారు. (డాంగే: భారతదేశం, మొదటి ముద్రణ (తెలుగు), పుట 80–81, విశాలాంధ్ర ప్రచురణాలయం).

"దీనినిబట్టి, వేదకాలపు ఆర్యులు సమష్టిగా పనిచేసేటప్పుడూ, గానం చేసేటప్పుడూ, సోమరసం తాగేటప్పుడూ - అంటే యజ్ఞకర్మ ఆచరించేటప్పుడు - ప్రతి పనిలోను తమ జీవితంయొక్క నరనరాల్లో గణ భావాన్ని అనుసరిస్తారు. ఈ సమష్టి గణజీవిత భావననూ, చైతన్యాన్నీ విశ్వవ్యాప్తమైన బ్రహ్మగా చూస్తారు. ఈ సర్వరూపమైన బ్రహ్మయే గణం.

ఇది గణంతప్పు వేరొకటికాదు. ఆనాటి వారి అభివృద్ధిదశలో అదొక అగమ్యమైన శక్తి; అది యజ్ఞంవల్ల పుట్టి, యజ్ఞంలో అస్తిత్వాన్ని పొందుతుంది; యజ్ఞంవల్ల ఆహూతమవుతుంది; పిలువబడుతుంది. సమష్టి శ్రమలో భౌతికప్రవృత్తులకు కలిగే ప్రోత్సాహమూ, ఆనందాతిశయమూ అనాగరికమానవునికి అగమ్యగోచరంగా, మాంత్రికశక్తిగా కనపడ్డంలో ఆశ్చర్యం లేదు." (పై గ్రంథమే, పుట 94).

ఆర్యులు రాకకు పూర్వం భారతదేశంలో అనేక ఆదిమ తెగలు ఉండేవి. ఈ తెగల ఆచారాలు, పద్ధతులు యిప్పటికీ అనేక ప్రాంతాల్లో మనం చూస్తున్నాం (ఉదా: కోయలు, సవరలు ముండాలు, భిల్లులు, తోడాలు వగైరా). పురావస్తు పరిశోధనల ఫలితంగా. వారు ఉపయోగించిన పనిముట్లు, వారి ఆచారవ్యవహారాలు ఎలా వుండేవో తెలుసుకోవచ్చు. ఈ ఆదిమతెగలే వర్గరహిత సామాజిక వ్యవస్థకు తార్కాణమని శ్రీ డి.డి. కొశాంబి "An Introduction to the study of Indian History" అనే గ్రంథంలో సోదాహరణంగా వివరించారు.

## 2. బానిసయుగం శ్రామిక ప్రజలపై విపరీతమైన భారాలు మోపింది; దారుణమైన కష్టాలు తెచ్చిపెట్టింది (పేజీ 21, పంక్తి 23):

భారతదేశంలో బానిస వ్యవస్థనుగురించి మార్క్సిస్టు పరిశీలకులు కొన్ని పరిశోధనలు జరిపారు. "భారతదేశం" అనే గ్రంథంలో శ్రీ డాంగే ఆదిమ గణాలు విచ్ఛిన్నమయాక బానిస వ్యవస్థ అవతరించిందనీ, భారత యుద్ధం వరకూ బానిసరాజ్యాలు వర్ధిల్లేయనీ తెలియజేశారు. అయితే, భారతదేశంలో బానిసవ్యవస్థ ప్రాచీన గ్రీసు, రోమ్‌దేశాల్లో ఉన్నలాంటిది కాదు. పెద్ద పెద్ద భూఖండాలపై వేలాది బానిసలచేత పనిచేయించే పద్ధతి ప్రబలంగా, విస్తృతంగాలేదు. పురాణాల్లోను, ఇతిహాసాల్లోను, జాతక కథల్లోను, స్మృతుల్లోను బానిసల విధుల్నిగురించి, వారు విముక్తిచెందడానికి పాలించవలసిన షరతులనుగురించీ, ఆస్తి సంక్రమణగురించీ, కొన్ని హక్కులనుగురించీ చెప్పబడినమాట వాస్తవమే. కాని, ప్రధానంగా గృహ దాస్యమే బానిసలకు, బానిస యజమానులకు గల సంబంధం. ఈ సమస్యపై శ్రీ డాంగే యిలా రాశారు:

"గృహదాస్యం అంటే, బానిసలు యజమాని యింట్లో సేవచేయడం మాత్రమేకాదు. గృహ పరిశ్రమల్లోను, వ్యవసాయ కమతాల్లోను, పెద్ద పెద్ద ఎస్టేట్లలోను 'స్వేచ్ఛగలిగిన' రైతులతోకలిసి, కూలికి పనిచేసే కార్మికులతో కలిసి పనిచేసేవారనడానికి తగినంత సాక్ష్యంవుంది. బానిస యజమానులు ఆదాయం సంపాదించడానికి బానిసలను అద్దెకుకూడా యిచ్చేవారు. పట్టణాలవద్ద పెద్ద పెద్ద భూఖండాల్లో బానిసలూ, కూలికిపనిచేసేవారూ వ్యవసాయ పనులుచేసేవారు. అవి రాజుల ఆస్తిగావుండేవి. వ్యక్తిగత భూస్వాములు కూడా ఉండేవారని చెప్పబడింది. వారిలో కొందరు పవిత్ర బ్రాహ్మణులుకూడా. అయితే, గ్రామసీమల్లో వ్యవసాయోత్పత్తి ప్రధానంగా బానిసలవల్ల జరిగేది కాదు. అక్కడ గృహపతి, లేదా కులపతి నాయకత్వం కింద స్వేచ్ఛ గలిగిన కుటుంబాలే ఉమ్మడి భూమిని సాగుచేసేవారు. చేతివృత్తులు కేంద్రీకృతమైవున్న పట్టణాల్లోను, కొంత వరకు గ్రామాల్లోను బానిసలు ' గణనీయమైన సంఖ్యలో నియోగింపబడేవారు.

"ఈ విధంగా కుటుంబజీవితం, గృహదాస్యం ఒకదానితో ఒకటి కలిసి వుండడం, యిది దీర్ఘకాలం అమలు జరగడం, యితర రూపాల స్థానంలో బానిస విధానం ప్రవేశించకపోవడం- యిది భారతదేశంలో బానిస విధానపు ప్రత్యేక లక్షణం.

"జనాభా పెరగడంతోను ఉత్పత్తి అధికమవడంతోను కుటుంబాలు విడిపోయి, గ్రామరాజ్యం (Village Community) ఏర్పడింది. ఈ గ్రామరాజ్యంలో బానిస కూటాలు హీనజాతులుగా మారాయి. కుటుంబసభ్యులు వారివారి యిష్టాన్నిబట్టీ నైపుణ్యాన్నిబట్టీ, అవసరాన్నిబట్టీ వేర్వేరు వృత్తులు చేబట్టారు. అవికులాలుగా స్థిరపడ్డాయి. ఈ క్రమంలో వర్ణాలు తమ ప్రాముఖ్యతను కోల్పోయి. కులాలు నిలబడ్డాయి; గ్రామరాజ్యం అనే నూతన నిర్మాణంలో యివి వేర్వేరు అంగాలు.

"ఈ క్రమం అన్ని చోట్లా ఒకేవిధంగా జరగలేదు. స్థానికంగా భూమి యొక్క పరిస్థితుల్నిబట్టి జరిగేది." (డాంగే; 'న్యూఏజ్' మాస పత్రిక, 1954 సెప్టెంబరు, పుట 17-18.)

1960లో స్టాక్‌హోంలో జరిగిన ప్రపంచచారిత్రకవేత్తల మహాసభలో సోవియట్ ఎకాడమీషియన్ జుకోవ్ ప్రసంగిస్తూ బానిసవిధానం

సార్వత్రికమైనదశగా మార్క్సిస్టు చారిత్రకవేత్తలు భావించడంలేదనిచెప్పారు. ఉదాహరణకు, రష్యాలో బానిసవిధానం ఎన్నడూ ప్రధాన ఉత్పత్తి విధానంగా లేదని ఆయన చెప్పారు. జర్మన్ జాతుల్లోకూడా పరిస్థితి యిదేనన్నారు. ("మార్క్సిజం టుడే" - బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ సిద్ధాంత పత్రిక ; 1962 జూన్, పుట 184).

ఆఫ్రికాజాతులుకూడా బానిసవిధానం అనుభవించినట్లు ఆధారాలు లేవు.

## *3. ఇండియాలో సిక్కుల తిరుగుబాట్లు* (పేజీ 26, పంక్తి 15) :

ఔరంగజేబు పరిపాలనలో తిరుగుబాటు చేసిన సిక్కులలో జాట్ కులానికి చెందిన రైతులు ప్రముఖపాత్ర వహించారు. వీరు ఆగ్రా పరగణాలో కేంద్ర దోఆబ్ ప్రాంతంలోను, యమునానదికి కుడిభాగంలో ఉన్న విశాలమైన ప్రదేశంమీద నివసించేవారు. మొగల్ చక్రవర్తుల రికార్డులలో యీ ప్రాంతం అంతా పితూరీదార్లతో నిండివుండేదని పేర్కొనబడింది.

17వ శతాబ్దపు ఉత్తరార్ధభాగంలో గోకుల జాట్ అను జమీందారు మథురవద్ద "ఒక పెద్ద జాట్ సైన్యాన్నీ, యితర గ్రామస్తుల్నీ సమీకరించి తిరుగుబాటు చేశాడు." (మెహతా ఈశ్వరదాస్ నాగర్ : ఫుతూహత్-ఇ-ఆలమ్‌గిరీ). అతడు 1669లో చంపివేయబడ్డాడు. తర్వాత రాజా రామ్ జాట్, ఆ తర్వాత చౌరామన్ జాట్ నాయకు లయారు. రైతులు విస్తృతమైన ప్రాంతాల్లో పన్నులు చెల్లించడానికి నిరాకరించారు; ఆయుధాలతో పోరాడారు. 1681లో ఆగ్రా జిల్లాకు ఫౌజ్‌దారైన ముల్తాఫత్‌ఖాన్ పన్నులు నిరాకరిస్తున్న ఒక గ్రామంమీద దాడిచేయగా, రైతులతన్ని చంపివేశారు. ఆ దశాబ్దంలోనే ఒక జాగీర్దారు మూడు సంవత్సరాలు వరుసగా ఆగ్రా చుట్టూవున్న తన జాగీర్ల నుంచి పన్ను ఏమీ వసూలుకాలేదనీ, "కారణం తిరుగుబాటే"ననీ ఫిర్యాదు చేశాడు. క్రమంగా జాట్ తిరుగుబాటు ఒక బ్రహ్మాండమైన దోపిడీ ఉద్యమంగా పరిణమించింది. ఆగ్రా, ఢిల్లీలకు దిగువ నున్న పరగణాలన్నిటిలోను అది కొనసాగింది. ఔరంగజేబు చనిపోయిన తర్వాత జాట్‌లు యింకా పెద్దయెత్తున తిరుగుబాట్లు చేశారు.

సిక్కుల మతగురువుల్లో ఒకడైన హరిగోవింద్ హయాంలో (1606-45) సిక్కులు ఒక సైనికశక్తిగా తయారయారు. హరిగోవింద్ తన సాయుధబలాలతో మొగల్ సామ్రాజ్యంమీద తిరుగుబాటు చేశాడు. అతని సంప్రదాయాన్ని సిక్కుల కడపటి గురువైన గోవిందసింగ్ (1676-1708) ఉధృతంగా కొనసాగించాడు. 1709లో బాండా అనునతడు యుద్ధరంగంలోకి "కింది కులాలకుచెందిన హిందువుల్లోనుంచి ఆత్మార్పణకు సిద్ధంగానున్న అసంఖ్యాక ప్రజల్ని చీమలబారుల్లా ఒక మహాసైన్యంగా నిర్మించాడు." (మహమ్మద్ హాషీమ్ ఖాఫీఖాన్ : ముంతాఖాబ్-అల్‌లుబాబ్).

మేవాడ్ ప్రాంతంలో సత్‌నామీలు (హిందువుల్లో ఒక శాఖ) కూడా పెద్ద తిరుగుబాటు చేశారు. ఇది 1672 లో జరిగింది. రైతులు, వడ్రంగులు, వీధులూడ్చేవారు, చెప్పులుకుట్టేవారు అసంఖ్యాకంగా "భూమిలోనుంచి చెదపురుగుల్లా వచ్చారు; ఆకాశంనుంచి మిడతలదండుల్లా పడ్డారు." మొగల్ సేనలు అనేక దాడులుజరిపి తిరుగుబాటును అణచివేశాయి. కాని, తిరుగుబాటుదార్లు ధైర్యంగా పోరాడుతూ చనిపోయారు. యుద్ధసామగ్రి కొరవడినప్పటికీ వారు "మహాభారత యుద్ధాన్ని జ్ఞప్తికితెచ్చే దృశ్యాలను పునరావృత్తం చేశారు." (మా-అసిర్-ఇ-ఆలమ్‌గిరీ).

***4. అతడు (ఫ్యూడల్ ప్రభువు) తన ప్రాంతంలో సర్వాధికారి; తన యిష్టం వచ్చిన వ్యక్తిని అతడు శిక్షించవచ్చు.*** (పేజీ 26, పంక్తి 25) :

పాశ్చాత్యదేశాల్లో ఫ్యూడలిజానికీ, భారతదేశంలో ఫ్యూడలిజానికీ రూపంలో భేదం వుంది. అయితే, రెండూ దోపిడీ వ్యవస్థలే. భారతదేశంలో ఫ్యూడలిజం రెండు దశల్లో పరిణామం చెందిందని ప్రఖ్యాత మార్క్సిస్టు చరిత్రకారుడు డి.డి. కొశాంబి "An Introduction to the study of Indian History" అనే గ్రంథంలో నిర్ధారణ చేశారు. మొదటి దశ 4వ శతాబ్దం ప్రారంభం నుంచి 8వ శతాబ్దం మధ్యవరకు, రెండవ దశ 8వ శతాబ్దం మధ్యనుంచి మొగల్ చక్రవర్తులపాలన అంతమయేవరకు

వ్యాప్తిలో ఉన్నాయి. మొదటి దశకు "పై స్థాయి ఫ్యూడలిజం" (Feudalism from above) అనీ, రెండవ దశకు "కిందిస్థాయి ఫ్యూడలిజం" (Feudalism from below) అనీ ఆయన పేరుపెట్టారు. "పై స్థాయి ఫ్యూడలిజం"లో, చక్రవర్తి లేదా బలమైన రాజు తన సామంతుల నుంచి కప్పం వసూలు చేసేవాడు. ఈ సామంతులు తమ తమ ప్రాంతాల్లో స్వతంత్రులుగా ఉంటూ యథేచ్ఛగా పరిపాలించేవారు. మొత్తం మీద వారు ప్రత్యక్షంగా, భూస్వాములవంటి దళారీ వర్గంతో ప్రమేయం లేకుండా పరిపాలించేవారు. ఆ తర్వాతదశ "కిందిస్థాయి ఫ్యూడలిజం" ఈ దశలో ప్రభుత్వానికీ రైతులకూ మధ్య ప్రతి గ్రామంలోను భూస్వాములు బయల్దేరారు. క్రమంగా వీరు ప్రజలమీద సాయుధ అధికారం చెలాయించేవారు. ఈ వర్గం ప్రభుత్వానికి సైనిక సిబ్బందిని సప్లయి చేస్తూ వుండాలి. అందువల్ల ప్రభుత్వంతో వీరికి ప్రత్యక్ష సంబంధం ఉండేది. ఇతరులెవరూ దళారులుగా ఉండేవారుకారు. "పై స్థాయి ఫ్యూడలిజం" లో లాగ రైతుల నుంచి సరాసరి రాజోద్యోగులే పన్ను వసూలు చేయడం కాక, యీ చిన్న చిన్న దళారీలే వసూలుచేసేవారు. అలా చేసిన దాంట్లో కొంతభాగం వివిధ అంతస్థుల్లోవున్న ఫ్యూడల్ ప్రభువులకు (జాగీర్దార్లు, జమీందార్లు వగైరా) యిచ్చేవారు. దేశంలో వర్తక వ్యాపారం, క్రయవిక్రయాలు నెమ్మదిగా పెరగడంవల్ల యీ రెండు దశలమధ్య యీ వ్యత్యాసం ఏర్పడింది.

భారతదేశంలో బ్రిటిష్‌పాలన ప్రారంభం కాకముందు స్వయంపోషక గ్రామీణవ్యవస్థ చిరకాలం వర్థిల్లింది. అందులోవచ్చిన మార్పులకూ, పై రెండు దశల్లో పరిణతిచెందిన ఫ్యూడల్ వ్యవస్థకూ సంబంధంవుంది. కారల్ మార్క్స్, యీ స్వయంపోషక గ్రామీణవ్యవస్థను గురించి చాలా రాశాడు. "పురాతన కాలంనుంచీ భారతదేశంలో ఒక ప్రత్యేక సామాజికవ్యవస్థ సృష్టింపబడింది. దీనికింద ఏ గ్రామానికాగ్రామం ఒక నిర్దిష్ట పద్ధతిలో స్వతంత్రంగా, స్వయంపూర్ణంగా వుంటుంది....ఏక కుటుంబాలవంటి యీ గ్రామసంఘాలు చేనేత, చేవడుకు, చేసాగు అనే విచిత్ర సమ్మేళనలోని సామరస్యంమీద, దీనివల్లకలిగే స్వయంపోషకత్వంమీద ఆధారపడేవి," అని ఆయన రాశాడు (న్యూయార్కు డెయిలీ ట్రిబ్యూన్ : 1853, జూన్ 25). బ్రిటిష్ పాలకులువచ్చి ఏ

విధంగా యీ స్వయంపోషక ఆర్థికవ్యవస్థను విచ్ఛిన్నం చేశారో ఆయన వర్ణించాడు. వారి ఆవిరియంత్రాలు, స్వేచ్ఛా వ్యాపారం యిందుకు సాధనాలయాయి. ఆ విధంగా బ్రిటిష్‌పాలన "ఆసియా చరిత్రలోనే కనివినియెరుగనంత బ్రహ్మాండమైన సామాజిక విప్లవాన్ని తెచ్చింది," అని రాశాడు.

ఎంగెల్స్ యీ సమస్యను మరింత సాకల్యంగా చర్చించాడు. "కుటుంబం, వ్యక్తిగత ఆస్తి, రాజ్యాంగాల పుట్టుక" అనే గ్రంధానికి 1891లో ఆయన కొత్త పీఠిక రాస్తూ, కోవలెవ్‌స్కీ పరిశోధనల ఆధారంపై భారతదేశంలో మూడు రకాలైన స్వయం పోషక గ్రామాలుండేవని నిర్ధారణ చేశాడు. ఒకటి రక్త సంబంధంపై ఆధారపడ్డ అతి ప్రాచీనమైన గణాలు, రెండు: పితృస్వామిక సంబంధంపై ఆధారపడ్డ సమష్టి కుటుంబాలు. మూడు: కొంత భూమి ఉమ్మడిగాను, కొంత వ్యక్తిగత కుటుంబాల ఆస్తిగాను వున్న గ్రామ పంచాయతీలు. మార్క్స్ ఈ మూడవ తరగతికి చెందిన గ్రామాలనే దృష్టిలో వుంచుకుని రాశాడని శ్రీ డాంగే అభిప్రాయం. ఆయన యిలా రాశారు : "మార్క్స్ ప్రస్తావించిన గ్రామ పంచాయతీ యీ మూడవ తరగతికి చెందినది. అదిమ కమ్యూనిస్టు దశలో, అంటే వర్ణం లేదా కులం తల యెత్తని దశలో యిదిలేదు. వర్గాలు, వర్ణం, బానిసవిధానం వృద్ధిచెందిన తొలి రోజుల్లోకూడా యిదిలేదు. ఆ వ్యవస్థ పతనమయ్యాకనే, భారతదేశ ఫ్యూడలిజానికి సంబంధించిన గ్రామీణ వ్యవస్థ తయారయింది." (డాంగే: న్యూఏజ్; 1954 సెప్టెంబరు).

ఇట్టి గ్రామాల్లో వర్గపోరాటం ఏరూపంలో ఉండేదో తెలియజేస్తూ, డాంగే యిలా రాశారు : "గ్రామ పంచాయతీలో ప్రతికులానికీ, కులాల వారీగావున్న ప్రతి కుటుంబానికీ కొంత సాగుభూమి కేటాయింపబడేది. ఉమ్మడి భూమినుంచికూడా- అంటే అడవులు, నీటి వనరులు, గడ్డి వగైరా లభించే భూములు - వీరు సౌకర్యాలు అనుభవించేవారు. సాగుభూమి ప్రతి కుటుంబానికీ లభించేది. కాని కొన్ని కులాలు భూమిని కలిగియుండడంతోబాటు చేనేత, తోళ్ళపని, పారిశుద్ధ్యం, రక్షణ వంటి ప్రత్యేకవృత్తులకు బంధింపబడి వుండేవారు. ఆ విధంగా వ్యవసాయం, చేతి పరిశ్రమలమధ్య సమన్వయం ఉండేది.... అయితే, ఉత్పత్తిలో

పాల్గొనని కులాలుకూడా ఉండేవి. ఉదాహరణకు: బ్రాహ్మణులు విద్యాబోధ, అర్చన, ఋతునిర్ణయం మొదలైనవి చేసేవారు. క్షత్రియులు సైనికులుగా రాజు కొలువులో ఉండేవారు. రివెన్యూ అధికార్లు లెక్కలు రాసేవారు. వేర్వేరు ప్రాంతాల్లో వేర్వేరు పేర్లతో వ్యవహరింపబడేవారు. వీరు చేసేపనికి 'వేతనాలు' ఎక్కణ్ణించి వచ్చేవి? శ్రామిక కులాలు ఉత్పత్తిచేసే సరకులనుంచి; అంటే శ్రామిక కులాలు అదనపు శ్రమ ఫలితంనుంచి. ఈ అర్థంలో వీరు ఫ్యూడల్ శిస్తును గ్రహించే భూస్వాములు.

"ఈ శిస్తును వీరు భూమిపైగల యాజమాన్య హక్కువల్ల గ్రహిస్తూ వచ్చారా? లేదు. కాని, శిస్తుకు వీరు హక్కుదారులు.

"ఈ అధికారాన్ని ప్రభుత్వం బలప్రయోగంద్వారా కాపాడుతూ వచ్చిందా? ఔను.

"ఇతర కులాలవారు ఉత్పత్తిలో వారివారి స్థానాలకు బంధింపబడి యుండేవారు. వేర్వేరు చేతివృత్తులకు, వ్యవసాయానికి బంధింపబడి యుండేవారు. వారు ఉత్పత్తిచేసినదాంట్లో ఎంతెంత వాటా యితరుల కర్పించాలో కూడా విధింపబడి, అమలుజరపబడేది. అలా అమలుజరిపేది ప్రభుత్వం. ధర్మం అనేది యిందుకు సాధనం. పరిపాలనా కేంద్రాల్లోను, గ్రామాల్లోను యీ ప్రభుత్వాన్ని పాలకగ్రూపులకు చెందిన బ్రాహ్మణులు, క్షత్రియులు నడిపేవారు.

"ఈ సంబంధాలు వివిధ అంతస్తులమీద, పరాధీనతమీద ఆధారపడి వుండేవి. అలా వున్నప్పుడే యితరులు ఉత్పత్తి చేయగలిగేవారు; జీవించగలిగేవారు. అలా కట్టుబడి వుండకపోతే శిక్షలు విధింపబడేవి.

"గ్రామ పంచాయతీకిగల యీ ప్రత్యేక లక్షణాలు స్పష్టంగా ఫ్యూడల్ సంబంధాలను తెలియజేస్తాయి. ఈ గ్రామ పంచాయతీలకు పునాది వంశపారంపర్యమైన ఒకరకపు అర్ధ బానిస విధానం. అందులో అస్పృశ్యులు పాలకవర్గాలకు ఊడిగంచేసే అతినికృష్టమైన అర్ధ బానిసలు.

"రాజ్యపాలనలో కూడా యీ సంబంధాలే అమల్లో ఉండేవి. ఉత్పత్తిలో పాల్గొనని బ్రాహ్మణ, క్షత్రియ, పాలక కులాలచేతుల్లో ప్రభుత్వం ఉండేది. రివెన్యూ అధికారులైన కాయస్థ కులస్తులు కూడా యిందులో భాగస్వాములే." (డాంగే : 'న్యూఏజ్', సెప్టెంబరు 1954).

